## రినైజన్స్ పబ్లికేషన్స్:

1. యుద్ధం – మన కర్తవ్యం.
2. రాయ్ జీవితం
3. ఇండియాలో విప్లవం
4. గాంధీజం, సోషలిజం, ఫాసిజం
5. ప్రజలపార్టీ ఏది?
6. జాతీయప్రభుత్వం – ప్రజాస్వామ్యం
7. రష్యా విప్లవం

అక్టోబరు 1943



లక్ష్మీ పవర్ ప్రెస్,
తెనాలి.



కోగంటి సాంబయ్యగారు

# పరిచయం

జాతీయవాది తానెట్లా తప్పో తెలుసుకోవాలన్నా, విప్లవవాది తానెట్లా రైటో నిర్ణయించుకోవాలన్నా, కోడ మీది పిల్లులు తమ వాలకాన్ని యితరులు యెట్లా అర్థంచేసుకుంటున్నారో తెల్సుకోవాలన్నా—యీ పుస్తకాన్ని చదివి, యీ 'గీటురాయి'తో తమ పరిమాణాన్ని యేర్పాటుచేసుకోవాల్సి వుంటుంది.

ప్రజలు అలవాటుపడ్డ ధోరణిలో వ్రాయటం తేలికే, అది కాదన్నట్టు, అదే చెప్పే ధోరణీ అంతే. తానేమిటో యితరులకు తెలియబడకుండా, ప్రజల అభిరుచుల్ని తృప్తి పరచటానికి వ్రాసే 'ప్రియభోజన' రచనలూ తేలికే!

కాని, గాలితోపాటు పోకుండా, వున్న విషయాల్ని వున్నట్టుగా, మర్మం లేకుండా చెప్పటం, అజ్ఞానానికి పురిటి కొంపగా వున్న మనదేశంలో యెంతో కష్టం. అందులో రాజకీయ విషయాల్లో మరీ! ఆ విషయాల్లోనే ప్రవేశించారు సుబ్రమణ్యంగారు.

సుబ్రమణ్యంగారి రచనలో ఒక విశిష్టతుంది. చెప్పదల్చుకుంది గిరాటువేసినట్టు చెప్పివేస్తాడు. భావనాప్రపంచంలో పెంచి, అల్లికలల్లి, తీగలు తొడిగే అలవాటు లేనే లేదు. తిమ్మిని బమ్మిగా, బమ్మిని తిమ్మిగా చేయరాదు. సూటిగా ఆలోచించటం; సూటిగా చెప్పివేయటం. అంతే! కష్టంగానీ, నిష్ఠూరంగానీ!

ఇది మన సాంప్రదాయానికే పడనివిషయం. సాంప్రదాయం అయోగ్యమైనప్పుడు, చెప్పితీరాలి. అదే, యీ పుస్తకంలో సుబ్రమణ్యంగారు చేసినపని.

ఈపుస్తకం ఒకర్‌సారికూర్చుని యేకథాటిగా వ్రాసింది కాదు. రెండుసంవత్సరాలలోపల మనదేశంలో యేర్పడ్డ గడ్డు సమస్యల్ని పరిష్కరించే మార్గాన్ని చూపుతూ వ్రాయబడినై.

చూట్టానికి విడివిడి వ్యాసాల్లాగా కనబడ్డా, వీటన్నిటిలో అంతర్గతంగా, ప్రజాస్వామ్యదృష్టి, యేకలక్ష్యసాధన వున్నై.

ఆదర్శాలకన్నా వాటిని ఆచరణలోపెట్టే మార్గాలకే యెక్కువ ప్రాధాన్యంయిచ్చి, మనదేశంలో జాతీయవాద నాయకత్వం దేశవాళీ ఫాసిజంగా తయారై, జాతీయత అనే మత్తుమందుతో ప్రజాస్వామ్యాన్ని నాశనంచేసి, వుద్యమాన్ని బెట్టి, ఇండియాని విప్లవమార్గాన్నుండి పెడత్రోవను బట్టించి, ఇది మనదేశంకాదు—దాని రక్షణతో మనకు నిమిత్తంలేదని, ప్రజల్లో జాతిద్వేషాన్ని రేకెత్తించింది. జాతీయప్రభుత్వం సర్వరాజకీయరోగనివారిణిగా ప్రచారం చేయబడుతుంది.

ఇది దుష్ప్రచారం. దీన్ని యెదుర్కోవలసిన బాధ్యత అభివృద్ధిగోరే ప్రతి వ్యక్తిమీదా వుంది. సాహసించేవారు కొద్దిమందే! సుబ్రమణ్యంగారు ఆ పనికి పూనుకున్నారు. అన్ని సమస్యల్నీ కూలంకషంగా చర్చించారు......

మానవునికి స్వేచ్ఛలేకుండాచేసి, మరగాతయారుజేసి, ప్రపంచాధిపత్యంవహించాలనిపూనుకొన్న ఫాసీజాన్నినాశనం జేసి, ప్రజాస్వామ్యాన్ని కాపాడుకోటం విప్లవధర్మంఅన్నాడు.

అందుకనే యిది ప్రజాయుద్ధమన్నాడు; యీ యుద్ధ ప్రయత్నాల్ని ప్రజాస్వామ్యశక్తుల పరంజేసి, పరిశ్రమల్ని తీవ్రంగా పెంచి, మిలిటరీని విరివిగా నిర్మించాలన్నాడు. ప్రజాస్వామ్యం అంటే ఫాసిస్టువ్యతిరేకతన్నాడు; ఫాసీజం యెక్కడో దూరభూముల్లో వుండేకాదు, మన యింటిలో

వుంది, దాన్ని ముందు నిర్మూలం చెయ్యాలన్నాడు....

పరిశ్రమ లభివృద్ధి అయితేతప్ప, ప్రజల కొనుగోల్శ. శక్తి పెరగదు. ప్రజల కొనుగోలుశక్తి పెరగటం, దేశవాళీ ధనాఢ్యులకు గిట్టదు. జాతీయప్రభుత్వం వాళ్ళ ప్రభుత్వమే! వివిధపార్టీల ప్రభుత్వాన్ని స్థాపించటానికి సావకాశమే లేదు. జాతీయప్రభుత్వ మనేది ఒక వర్గానికిచెందిన ప్రభుత్వం— దేశీయ పెట్టుబడిదార్లకు చెందింది. అందుకని, పీడితజనానికి దాంతో తీరేది లేదు, పేదలబాట వేరు అన్నాడు....

జమీందారీ- ధనికవాదశక్తులు, మధ్యతరగతులకు నాయకత్వం రాకుండా జేసి, అగ్రవర్గాల నిరంకుశాన్ని స్థాపించాలని చూస్తున్నారు. అందుకని, వారికి జాతీయతే ప్రధానం; ప్రజాస్వామ్యంకాదు. ప్రజలు, ప్రజాస్వామ్యం కావాలని, భూమి దున్నేవాడే కామందుగా వుండాలనీ, ఆయుధ శాసనం పోయి, తాను ఆయుధాల్ని ధరింపగలగాలనీ కోరుకుంటున్నాడు. ఆ ప్రజాస్వామ్యశక్తులపోరాటమే విప్లవమన్నాడు.

యివన్నీ యెట్లా నిర్వహించుకోవాలో పుస్తకంలో చూడండి.

తెనాలి,
12–10–43.

ఆవుల గోపాలకృష్ణమూర్తి,
ప్రధాన కార్యదర్శి,
ఆంధ్రరాష్ట్ర రాడికల్ డెమోక్రాటిక్ పార్టీ.

★

## దిద్దుబాటు

1. 10 పేజీ, 21 బంతి : వ్యూహిస్తున్న ఊహావాదులు ప్రస్తుత
2. 35 పేజీ, 24 బంతి : నిరాకరించరు.
3. 54 పేజీ, 9 బంతి : అదర్శ...అదృశ్య అని.

★

# జాతీయ ప్రభుత్వం

మనదేశంలో, రాజకీయాల్లో కొద్దో గొప్పో, ప్రవేశమున్న వాళ్ళంతా చాలావరకు జాతీయప్రభుత్వం కావాలని కోరుకుంటున్నారు. అది వచ్చిన మరుక్షణం అంతా చక్కబడుతుందని విశ్వసిస్తున్నారు. అయితే జాతీయప్రభుత్వం, ఎవరెవరితో, ఏయే పార్టీలతో ఏర్పరచబడాలన్న దాని మీద వారిలో ఏకీభావంలేదు. ఇంగ్లీషువారుపోయి, వారిస్థానంలో భారతీయులువస్తే చాలు. వారికదే కావల్సింది. సాధారణ జాతీయవాది మూఢనమ్మకాలలో మునిగితేలుతూ, చారిత్రక కారణాలవల్ల జాతిద్వేషంతో నిండియున్నాడు. అందుచేత సాంఘిక అభివృద్ధినిగురించి సహేతుకంగాను, నిలకడగాను అతను యోచించడు. దానిఫలితంగా, స్వాతంత్ర్యసమస్యను పైవిధముగా చులకనచేస్తున్నాడు.

ఏది ఎలా అయినప్పటికీ, యుద్ధానంతరంగాని, అంత కింకా ముందుగాగాని, ఇండియాలో జాతీయప్రభుత్వం ఏర్పడేందుకు ఎక్కువ అవకాశముంది. కనుక ఆ మార్పు జరిగీజరగటంతోనే, అంతా చక్కబడుతుందని ఎవడూ తటపటాయిస్తూ కూర్చో కూడదు. తాము వామపక్షం వారమని గర్వించే స్వాములుకూడా జాతీయప్రభుత్వాన్ని కావాలని కోరేవారిలో అగ్రగణ్యులుగావున్నారు. ఈ సందర్భంలో వారు మరొకసారి ఓపికపట్టి, యోచించటం చాలా అవసరం. తప్పుడుఊహాలతో వారు పెడమార్గాలు త్రొక్కించబడుతున్నారు. రానున్న జాతీయప్రభుత్వాన్ని నడుపుతూ, దాని చర్యలను అదుపులో వుంచుకొనే పెద్దమనుష్యుల వుద్దేశాల, పనుల విషయములో వారిలో వివేకలు, ఎట్టి అపోహాలును పోవటంలేదు. పాత రాజకీయ పార్టీలన్నీ కలసిగాని, కాక, కాంగ్రెసు ఒక్కదానిచేతగాని, ఏర్పరచబడబోయే జాతీయప్రభుత్వం ప్రజాసామాన్యానికి కావలసిన స్వాతంత్ర్యాన్ని స్థాపించబోవటం లేదన్న నిజాన్ని వారు అంగీకరిస్తారు. అయినప్పటికీ, విదే

శీయప్రభుత్వం పోయి దానిస్థానే స్వదేశీయప్రభుత్వం ఎట్టిదయినా ఏర్పడటం అంటే స్వాతంత్ర్యంవైపు ముందంజవేయటమేనని వారు వాదిస్తారు.

జాతీయరాజ్యాంగం చారిత్రాత్మకంగా అవసరమన్నసూత్రాన్ని ఆధారంగా చేసుకొని, బయలుదేరిన వాదమేయిది. సామ్రాజ్యవాద రాజ్యాంగం కన్న, పెట్టుబడిదారుల అధీనంలోగాని, కాక, అంతకన్న నికృష్టవిప్లవ వ్యతిరేక వర్గాల చెప్పుచేతులక్రింద వుండే జాతీయ రాజ్యాంగంమేలని వారు విశ్వసిస్తున్నారు. సిద్ధాంతదృష్ట్యా అది నిజంకావచ్చు. కాని ఒకే రాజకీయ సూత్రం ప్రపంచచరిత్ర అన్ని యుగాల్లోను ఒకే ఒకవిధంగా చలామణి కాజాలదు.

వామపక్షీయులు, జాతీయప్రభుత్వం వాంఛను బలపరచరావటానికి, యింకొక కారణ ముంది. సామ్రాజ్యవాదరాజ్యాంగంకన్న జాతీయ పెట్టుబడి రాజ్యాంగం దుర్బలంగా వుంటుందని వారి నమ్మిక. నిజంగా ప్రజాశ్రేయస్సు కోరి చేయకపోయినా, ప్రజాశక్తికి తాళలేక, కొన్నికొన్ని అధికమయిన, ప్రజోపకరమయిన, పనులను జాతీయప్రభుత్వం చేయకతప్పదని కూడా వారి విశ్వాసం. ఆ పరిస్థితుల్లో ఒకవేళ, ఆ ప్రభుత్వం అలా చేయని పక్షంలో, ప్రజాశక్తులు తామంతట తామే నిలబడి, ప్రభుత్వవిధానాన్ని తేలికగా మార్చివేయగలవని వారి నిర్ణయం. ఈవాదంప్రకారం పోతే, ప్రజా వ్యతిరేకవిధానానికి దారి తీయించేటటువంటి తనపైనున్న పైవర్గాల ప్రాబల్యాన్ని, జాతీయప్రభుత్వం కాలదన్ని, ప్రజాప్రభుత్వాన్ని స్థాపించటం తప్పనిసరి అన్ని తేలుతూవుంది. ఇంకో మాటలో దేశీయ ఆర్థికజీవితాన్ని అదుపులో పెట్టుకొన్న, అల్పసంఖ్యాక ఉన్నతవర్గాన్ని నెట్టివేసి, అలా దేశాన్ని ప్రజాస్వాతంత్ర్యంవైపుకు ముందుకు తీసుకొనిపోవటానికి జాతీయ ప్రభుత్వం సంసిద్ధపడుతుం దని ఎంచబడుతూ వుంది.

ఈ ఉద్దేశాలు, చాలావరకు ఊహాప్రపంచాన్ని ఆధారంచేసుకొని బయలుదేరాయి. రాజకీయశక్తుల్లో, ఆటువంటి అనుకూలమయిన మార్పును

-స్తారు వూహిస్తున్నారు. అప్పుడు వారి యిష్టానుసారం ప్రజాశక్తికి ఆగలేక కూలదోయబడుతుందన్న భయంతో, రానున్న జాతీయప్రభుత్వం నడచుకొంటుందని, వారు గాఢంగా నమ్ముతున్నట్టు, వెల్లడవుతూవుంది. ఇది గాల్లో మేడలుకట్టడం. కారణం, దేశీయ ఆర్థికజీవితంలో కీలకస్థానాన్ని, దానితో బాటు జాతీయరాజ్యాంగాన్ని, గుప్పెట్లో పెట్టుకొని, తద్విరుద్ధంగా పై వున్నతవర్గాలు చేసే ప్రయత్నాలను, వారు లెక్కలోకి తీసుకోవటంలేదు. రష్యావిప్లవదినాల్లోని, కెరన్‌స్కీ ప్రభుత్వంలాగా, జాతీయప్రభుత్వం, దుర్బలంగా వుంటుందని వూహించటం కేవలం కలలు కనటం అవుతుంది. 1917 వేసవిలో రష్యావున్న సందిగ్ధస్థితిలో, ఇప్పుడు ఇండియా లేదు. రష్యాలో మాదిరిగానే ఇక్కడ అంత తేలికగా అధికారం చేతులుమారబోదు. పూర్వాపు ప్రభుత్వనిర్మాణాలు వేరు. ఇప్పటి ప్రభుత్వనిర్మాణాలు వేరు. కనుక ఆ అంచనా వట్టి తప్పుడు సాదృశ్యంమీద ఆధారపడి వుంది.

జాతీయరాజ్యాంగం కావాలని కోరే వామపక్షీయులు మరొక కారణం చూపుతున్నారు. జాతీయరాజ్యాంగాన్ని ఏర్పరచటమే దానంతట అది దేశంలోని పురోభివృద్ధిశక్తులన్నిటికీ, ఆహ్వానింపతగ్గదేకదా అని వారి ప్రశ్న. వలసదోపిడీవిధానంకన్న జాతీయపెట్టుబడి ఆర్థికవిధానంక్రింద భారతీయప్రజ బాగుపడుతుందన్న సాకును వారు ఇందుకు చూపుతున్నారు. ఇది ఇంకొకదానిని ఆధారంచేసుకొని వుంది.

అన్నిసమయాల్లోను, ప్రపంచచరిత్ర అన్ని యుగాల్లోను, పెట్టుబడిదారీ విధానం విముక్తిచేకూర్చే శక్తిగా, అభివృద్ధిని తెచ్చిపెట్టే శక్తిగా పని చేయక తప్పదని. నిజానికి పెట్టుబడిదారీవిధానాన్ని నెలకొల్పి, నేటి ప్రపంచంలో ఏ భాగములోనయినా దాన్ని నిలబెట్టాలంటే అవసరంగా తీసుకోవాల్సిన అభివృద్ధినిరోధక పద్ధతులను చేపట్టేందుకుసహితం దేశీయ ధనాఢ్యవర్గం తయారుగా వుంది. వారుతప్ప, పాతరాజకీయపార్టీలు, సాధారణ జాతీయవాది కోరేటటువంటి జాతీయప్రభుత్వాన్ని ఎవరూ చూస్తూ చూస్తూ

హృదయపూర్వకంగా కోరజాలదు.

కనుక కేవలం జాతీయసంకుచితభావాలతో కాకుండా ఇతర కారణాలతో జాతీయప్రభుత్వ కోరికను, బలపరిచే హృదయంగల, విచక్షణ గల వామపక్షీయులు వారి వ్యూహాపోహాలు ఎంతవరకు ఆధారమయినవో పరిశీలించటం అవసరం. సూక్ష్మదృష్టితో చూస్తే జాతీయప్రభుత్వాన్ని కొని తెచ్చుకోవటం, దేశీయ పెట్టుబడిదారీ రాజ్యాంగాన్ని తెచ్చిపెట్టుకోటమవుతుంది. దానంతట అది ఆక్షేపణీయమయినది కాదు. కాని, పెట్టుబడిదారీ విధానం అభివృద్ధికరమయినదిగా గాని, విముక్తిని చేకూర్చేదిగా గాని, ప్రస్తుత ప్రపంచ యుగచరిత్రలో వుపకరిస్తుందా? అదే తేల్చుకోవలసిన గడ్డుప్రశ్న. జాతీయ స్వాతంత్ర్యాన్ని, ప్రజా ఐశ్వర్యానికీ, భావి భాగ్యోదయానికి దారితీసే ప్రజాస్వాతంత్ర్యంగా, పరిగణించేవారి వైఖరి ఈ ప్రశ్నకిచ్చే సమాధానాన్నిబట్టి వుంటుంది. దేశంలో వున్న శక్తుల సంబంధాలను బట్టి వ్యాపారస్థుల, పారిశ్రామిక యజమానుల ఇష్టానిష్టాల ననుసరించి రానున్న జాతీయ ప్రభుత్వం విధిగా నడుచుకోక తప్పదు. అట్టి జాతీయ ప్రభుత్వాన్ని, యుద్ధానంతర, పునర్నిర్మాణ సమస్యలననుసరించి పరిశీలించవలసి వుంటుంది. వాటిని పరిశీలించే ముందు, ఆ సమస్యలను విపులంగా తెలుసుకోవటం అవసరం. ఇక రెండవది, ప్రపంచ పునర్నిర్మాణ సమస్యలనుండి, ఇండియా పునర్నిర్మాణ సమస్యలను, వేరుచేసి చూసేందుకు వీలులేదు. ఈ రెండు విధాలయిన సమస్యలు, ఒకదాని మీద ఒకటి ఆధారపడి వున్నాయి. అందువల్ల వాటిని కలిపే పరిష్కరించాలి. స్వార్థానికి దారితీస్తున్న జాతీయ విధానం, ఇండియా భవిష్యత్తును నిస్సందేహంగా పరిష్కరించ జాలదు. మనము ఎదుర్కోవలసింది ఆర్థిక పరస్పర సహకార అవసరాన్ని. ఇంకొక మాటలో ఆర్థిక జాతీయవాదం (స్వయంసంపూర్ణత్వ సిద్ధాంతం) పనికిరాదు. ఈ సహకారం ఇండియా ఒక జాతిగా అనుభవించాల్సిన రాజకీయ స్వాతంత్ర్యాన్ని ఏవిధంగాను కుంటుపరచదు. ఇండియా భవిష్యత్ స్వరూపానికి విశాల హద్దు

లవి. ఆయాకారములో జాతీయ పెట్టుబడిదారీ రాజ్యాంగాన్ని ఇమడ్చ సాధ్యమా? ఆ స్థితిలో పెట్టుబడిదారీ విధానం అభివృద్ధికి, దాస్యవిముక్తికి, దారి తీస్తుందా?

ఈ వాదంలో ఎంత బలముందో తెలుసుకోవాలంటే వామపక్షీయులు, కోరే జాతీయ ప్రభుత్వ సాంఘిక లక్షణం, ఎలాంటిదన్నదానిమీద, ముందు ఏకీభావము కుదరటం అవసరం. అది పెట్టుబడిదారీ ప్రభుత్వం కాబోతూ వుంది. కనుక పెట్టుబడిదారీ వుత్పత్తి విధానాన్ని అనుసరించే రేపు ఇండియా పునర్నిర్మాణ సమస్యలను అదిపరిష్కరింప బూనుకుంటుంది.

ఎవరయితే ఈప్రధానవిషయాన్ని అంగీకరించరో, వారు వూహా ప్రపంచములో నృత్యంచేస్తూ అయినావుండాలి, మోసగాళ్ళయినా అయి వుండాలి. లేదా, ఇప్పటిపరిస్థితిలో, యదార్థసంఘటనలను విడిచివుచ్చే వారయినా అయివుండాలి. దేశంలోని పాతరాజకీయపార్టీలన్నీ, పెద్ద పెద్ద వ్యాపారస్తుల పారిశ్రామిక యజమానుల గుప్పెళ్లో వున్నాయి. పైగా నాటిమీద, విప్లవ ప్రత్యాఘాతక జమీందారీ శక్తులు పలుకుబడిని చలాయిస్తున్నాయి. ఇక మితవాదులు, నాన్‌పార్టీ నాయకులు, దేశీయ బూర్జువా వర్గాల ప్రతిబింబాలన్న సంగతి ప్రత్యక్షరహస్యమే. అధికారాన్ని ఇవ్వటం విషయంలో, ఇండియా ప్రభుత్వంకూడా అట్టిధనాఢ్యపార్టీలతో తప్ప ఆలోచించరావటంలేదు. కనుకనే అధికారాన్ని హస్తగతంచేసే ముందు, పెద్ద పార్టీలలో ఏకీభావంవుండాలని అది నొక్కిచెప్పటం. ఈ యదార్థవిషయాలు గానున్న జాతీయప్రభుత్వ సాంఘికస్వభావాన్ని ముందుగా వెల్లడిచేస్తున్నాయి. దాన్ననుసరించి దాని కార్యక్రమ విధానాలు నిర్ణయించబడుతున్నాయి. కనుక, అటువంటి ప్రభుత్వంక్రింద ఇండియాస్థితి ఎలావుంటుందో దూరదృష్టితో ముందుగా చూడవలసివుంటుంది.

సాధారణంగా ఆర్థికంగా వెనుకబడియున్న ఇండియాలాంటి దేశములో, పెట్టుబడిదారీ విధానం, అభివృద్ధికరంగా పనిచేస్తుంది. కనుక పై

వర్గాల ఆధిపత్యంక్రింద జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పరచటం ఒక అడుగు ముందుకు వేయటమవుతుందిగదా అనవచ్చు. కాని ఇండియా ఆర్థిక పురోభివృద్ధి, పెట్టుబడిదారీ విధానంక్రింద జరుగగలదా? ఈ ప్రశ్నకు సమాధానం "జరుగదు" అనివస్తే, వామపక్షీయులు అప్పుడు జాతీయప్రభుత్వం కావాలనటానికి ఆధారంలేదు. మనయుగంలో దేశీయఆర్థికాభివృద్ధి, యంత్రోత్పత్తిని ప్రవేశపెట్టడమువల్ల జరుగుతుంది. దేశాన్ని పారిశ్రామికంగా తయారు చెయ్యాలనేది, యదార్థానికి సాధారణ జాతీయ వాంఛ. కాని ఒక కోరిక కోరటంవేరు, దాన్ని ఆచరణలో పెట్టటంవేరు.

మనదేశాన్ని ఇంతవరకూ పారిశ్రామికంగా ముందుకు పోకుండా బ్రిటిష్‌ప్రభుత్వం ఆటంకపరచిందని నమ్మబడుతూవుంది. కాని వాస్తవానికి దేశంలోని ఇతరశక్తులే ఎక్కువగా అందుకు, అడ్డు వచ్చాయి. పరిమితి లేకుండా దేశీయ పరిశ్రమలు పెంపొందాలంటే, ఎల్లప్పుడూ కొరతలేకుండా దేశీయమార్కెట్టు వృద్ధికాంచుతూ వుంటం ముఖ్యం. మనకాలంలో విదేశ మార్కెట్టులో, ఇదివరకే అంతగా పోటీలు జరుగుతున్నప్పుడు, ఆ పోటీలను మనముకూడా ఎదుర్కొవలసిన అవసర మున్నప్పుడు, దాని ప్రాధాన్యం మరీ మిసుమిక్కిలి. కనుక ఇండియా ఆర్థిక పురోభివృద్ధి సమస్యల్లా, ఇండియా ప్రజల కొనుగోలు శక్తిని ఎలా పెంపొందించటమా అని. పెట్టుబడిదారీ విధానం ఆ సమస్యను పరిష్కరించకలదని రుజువయితేతప్ప, దాన్ని అభివృద్ధికరమయిన శక్తిగా పరిగణించటానికి వీలుకాదు. ఆ సమస్యను పరిష్కరించేందుకు, ముందు పరిష్కరించవల్సింది ప్రధానమైన రైతుసమస్యను. అనగా, నిజమయిన వ్యవసాయదారునికే భూమిని అప్పచెప్పటంవరకూ శాసనం చేయవల్సివుంటుంది. ఇది భూస్వాములకు కంటగింపుగా వుండక తప్పదు. అది యింకో మాటలో, సాంఘికవిప్లవం చేయటమన్నమాట. ఒక నిర్ణీతమైన చరిత్రయుగంలో పెట్టుబడిదారీ వర్గం, సంఘాన్ని ముందుకు తీసుకుపొయ్యేందుకు హక్కుపొంది, అట్టి విప్లవాన్ని చేయించి, అభివృద్ధిని తీసుకొనిరావ

టంలో దానికి పురోగామిగా పని చేస్తుంది. ఇండియాలో ఇంకా జరగవల్సిన అట్టి విప్లవాన్ని జాతీయప్రభుత్వం నడుపుతుందా? జాతీయప్రభుత్వాన్ని అదుపులో వుంచుకొన్నా, పార్టీల రికార్డులనుబట్టి చూస్తే, ఆ విషయంలో ఎట్టి ఆశ మనకు వుండనక్కరలేదు. అటువంటి మొదటి విప్లవచర్యను నెరవేర్చరాకుండా పెట్టుబడిదారీ విధానం, సాంఘికంగా, పురోభివృద్ధికరంగా పని చేసే అర్హతను కోల్పోయింది. కారణం, అలా చేయకపోవటం దాని పురోభివృద్ధికే హాని. కనుక ఇండియాలో జాతీయపెట్టుబడి రాజ్యాంగపుపాత్ర— “ఒక కుంటివాడు ఇతరులను మోసుకెళ్ళినట్లుగా వుంటుంది.”

విదేశీయప్రభుత్వంవల్ల ఏర్పడిన యాదృచ్ఛికమైన ఆటంకాన్ని తొలగించినప్పటికీ దేశీయప్రజల కొనుగోలుశక్తి నికృష్టంగా అక్కడ వుండనే వుంటుంది. దేశం పారిశ్రామికంగా ముందుకు పోవాలనే వాంఛకు మరో అర్థం, ప్రారంభదశలో వున్న ఇండియాపరిశ్రమలకు, ఎక్కువ రక్షణవుండాలనే. దేశీయపరిశ్రమలకు విదేశప్రభుత్వం రక్షణ నివ్వటంలేదని చెప్పబడుతూ వుంది. అది పొరపాటు. పోయిన రెండు శతాబ్దాలలో, ఇండియా పరిశ్రమలలో, చాలా వాటికి రక్షణ యివ్వబడింది. ఏది ఎట్లయినా, ఆ సందర్భంలో వున్న కష్టనిష్ఠూరాలను జాతీయప్రభుత్వం తొలగించగలదని ఎంచబడుతూ వుంది. దాని ఫలితంగా, ఇండియాపరిశ్రమలు పూర్తిరక్షణలాభాన్ని పొందుతాయి. ఆ రక్షణ, దేశీయ పరిశ్రమలకు దోహదమిస్తుందా, లేక, అడ్డు వస్తుందా ?

రక్షణ, పోటీని పోగొట్టి వస్తువుల ధరలను పెంచుతుందన్న సంగతి అనుభవమువల్ల తెలిసిందే. మామూలుగా దానిని అందరూ అంగీకరిస్తారు; రక్షణ యివ్వబడిన పరిశ్రమలు మారకంకోసంకాక, వినియోగం కోసం వస్తువులను వుత్పత్తిచేస్తే, అట్టిరక్షణవల్ల ధరలు పెరగటంఅంటూ జరగదు. కాని జాతీయప్రభుత్వంక్రింద వుత్పత్తి విధానం అలా మార్చబడుతుందని ఎవరూకూడ సూచన చేయలేదు. పెట్టుబడిదారీ విధానాన్ని అనుసరించే

వుత్పత్తి జరుగుతుంది. పెట్టుబడిదారీ విధానం పనిచేసేది మారకం కోసం వస్తువులను వుత్పత్తిచేసేందుకు; వాటిని ఎక్కువధరకు అమ్మి లాభం పొందేందుకు. కనుక జాతీయప్రభుత్వం ఇవ్వబోతున్న రక్షణను ఆధారంచేసుకొని, ఇండియాలో తయారయిన సరుకులు విపరీత ధరలకు అమ్మబడతాయి. ఇంకొకప్రక్క, భారతీయ ప్రజాసామాన్యంలో చాలామందికి కొనుగోలు శక్తి ఇలాగే హీనంగా వుండిపోతుంది. అందువల్ల దేశీయమార్కెట్టు పడిపోతుంది. పడిపోయిన మార్కెట్టుతో సరిపుచ్చుకునేందుకు పారిశ్రామికోత్పత్తిని తగ్గించాల్సివస్తుంది. ఆపడిపోవటం దేశంలో అవసరంలేక కాదు. కొనదలచినవారిచేతుల్లో డబ్బు తక్కువగా వుంటంవల్ల, మితిమీరిన ధరలలో తక్కువ వస్తువులనే వారు కొనగలుగుతారు. అలా పరిశ్రమలను అభివృద్ధి పరచటానికిమారుగా, 'రక్షణ' అభివృద్ధిని అరికడుతుంది. మొట్టమొదటగా జాతీయప్రభుత్వం తీసుకొనబొయ్యే ఆర్థికవిధానఫలిత మిది. పెట్టుబడిదారీ విధానాన్ని దానంతట అది పెంపొందకుండా జాతీయప్రభుత్వ విధానమే చేస్తుంది. ఇక ప్రజలశ్రేయస్సుసంగతి దేవునికెరుక !

రాజకీయాధికారం చేతిలోవున్న దేశీయపెట్టుబడిదారులు యదార్థానికి ఓటమిని వొప్పుకోరు. దేశంలో వచ్చిన నష్టాన్ని భర్తీచేసుకోటానికి విదేశీయ మార్కెట్లకోసం యత్నిస్తారు. పెట్టుబడిదారీ విధాన అవసరాన్ని బట్టి జాతీయప్రభుత్వం ఎగుమతి వ్యాపారాన్ని అరికట్టవలసివస్తుంది. అందుకోసం కావలసినడబ్బును పన్నులద్వారా వసూలుచేయవలసివస్తుంది. భారతీయప్రజపన్నులభారాన్ని కొంతవరకే మోయగల స్థితిలోవుండటంచేత, అదనపుపన్నులు వారి కొనుగోలుశక్తిని మరీ క్షీణింపజేస్తాయి. ఇతర దేశాలలో ఇదివరలో తన పాత్రను నిర్వహించినట్లుగా, ఈసారి పెట్టుబడిదారీ విధానం ఇండియాలో సమాజాన్నంతను ఆర్థికంగా ముందుకు తీసుకుపోయే పాత్రను చేపట్టజాలదు. దానికి మారుగా, ప్రజల జీవితవ్యయప్రమాణాన్ని క్రిందకిదీస్తుంది. అలా ఆర్థిక పురోభివృద్ధికి మూలకందమైనదాన్ని నాశనము

చేస్తుంది.

జాతీయప్రభుత్వం అనుసరించాల్సిన ఇలాంటి ఆర్థిక విధానాలు, రేపో మాపో ప్రజలఅసంతృప్తికి దారితీస్తాయి! మహాత్ముణ్ణి, ఇతర జాతీయనాయక మన్యుల్ని తన అదుపులో వుంచుకొంటూ జాతీయప్రభుత్వం, తరతరాలుగా సంక్రమిస్తున్న దాస్యంలో మునిగితేలుతున్న ప్రజాసామాన్యాన్ని, కొన్నాళ్లు కళ్లుగప్పవచ్చు. కాని ఆ అనుకూలపరిస్థితుల్లోకూడా ప్రజలందరిని యెల్లకాలం జాతీయప్రభుత్వం కళ్లుగప్పజాలదు. యేనాటికైనా ప్రజాఅసంతృప్తి బహిర్గతం కాకపోదని, ఆప్రజా అసంతృప్తి ప్రజాప్రభుత్వం కావాలన్నఘోషతో, ప్రజాతిరుగుబాటుగా మారకపోదన్నసంగతిని జాతీయప్రభుత్వం ముందుగానే గ్రహించి మేల్కొంటుంది. కనుకఆట్టివాటిని వేటినైనా యెదుర్కొనేందుకు తయారై వుంటుంది. దీనినిబట్టి చూస్తే జాతీయప్రభుత్వంలో ఇప్పటికన్నా తమ హక్కులకై పోరాడేందుకు ప్రజాశక్తులకు యెక్కువ స్వేచ్ఛ, అవకాశాలుంటై అనుకోవటం కేవలం అవివేకం. జాతిలో ముఖ్యాంగమైనవారి నిజ శ్రేయస్సును వదలివేసి, అంతకన్నా జాతీయశ్రేయస్సే ముఖ్యమన్న బూటకపు ఆదర్శం ప్రజలముందు పెట్టబడుతుంది. జాతీయరాజ్యాంగం ఒక దైవస్వరూపం అవుతుంది. ఆ దేవదేవునికోసం జాతిలోని దురదృష్టవంతులంతా త్యాగాలు చేయవలసి వుంటుంది.

అది మంచా చెడా అన్నప్రశ్నకాదు. దాని ఉద్దేశమేమిటాఅన్న ప్రశ్నకూడాకాదు. జాతీయప్రభుత్వం ప్రపంచంలో చాలమంది ప్రాపకం సంపాదించవచ్చు. దాన్ని ఈనాడు కావాలని కోరేవారంతా నిజంగా అది వస్తే ఇండియాసమస్యలు పరిష్కరించబడుతాయని హృదయపూర్వకంగా నమ్ముతున్నారు. కాని పెట్టుబడిదారుల చేతిక్రింద వున్నంతవరకు, ఇంకో విధంగా నడవటానికి వీలులేని కారణంచేతా, జాతీయప్రభుత్వం పైనచెప్పిన విధంగా తప్ప ఇంకోవిధంగా నడువజాలదు. పెట్టుబడిదారుల ప్రాబల్యాన్ని త్రోసివేయగలిగితే, పాతరాజకీయపార్టీలు కోరే జాతీయప్రభుత్వంమాత్రం

కాబోదు. వామపక్షీయులు ఈనాడుకోరేది అలాంటి జాతీయప్రభుత్వాన్నే అనగా "పెట్టుబడిదారుల ప్రాపకంనుండి బయటబడగల జాతీయప్రభుత్వాన్ని"

జాతీయ ప్రభుత్వం పెట్టుబడిదారీ ఆర్థికవిధానమువల్ల రేగబోయే ప్రజా అసంతృప్తి, శక్తివంతమైన ప్రజా తిరుగుబాటుకు దారితీసి దానిని చివరకు కూలదోసే వరకు పోతుందన్న అంచనా ఒకటివుంది. ఈ అంచనా వూహా ప్రపంచాన్ని, ఆధారము చేసుకొని వుందని ఇదివరకే చూపబడింది. ఒక ప్రభుత్వం తీసుకోబోయే విధానంవల్ల, తిరిగిదానినే కూలదోయవలసిన అవసరం ఏర్పడుతుందన్న సంగతి ముందుగా తెలిసియున్నపుడు, అలాంటి దాన్ని స్థాపించటంకోసం మనము ఎందుకుగాను శ్రమపడాలి ? ప్రయాస పడాలి? ఆ ప్రభుత్వం అధికారాన్ని స్వీకరించిన తరువాత, దానిని కూల ద్రోయగలశక్తి, ప్రజాశక్తులకు వున్నస్థితిలో, వాటంతటవి తమకే అధికారం సంక్రమించేటట్టు ఎందుకు యత్నించకూడదు ? అందుకోసమే, మేము, జాతీయప్రభుత్వానికి బదులు ప్రజాప్రభుత్వాన్ని కావాలని కోరుతున్నాం. అందుకు యత్నిస్తున్నాం. ఈ మా ప్రయత్నానికి హృదయంగల, విచక్షణ గల, వామపక్షీయులుకూడా తోడ్పడితే, జాతీయప్రభుత్వానికి మారుగా, ప్రజాప్రభుత్వం ఏర్పడకపోదు. ఏస్థితిలోగూడ అటువంటి వామపక్షీయులు, ఇంకొక ప్రభుత్వాన్ని కోరజాలరు.

కొంతలో కొంత మెరుగని నమ్మబడుతున్నటువంటి జాతీయ పెట్టుబడి రాజ్యాంగాన్ని కూలద్రోయగల అవకాశాలేమిటి?

అది వేరుగా వుండబోతుందా, లేదా, అన్నది వేరేప్రశ్న. దానిని కూలద్రోయగల అవకాశాలున్నాయని వూహిస్తున్న ప్రస్తుత ప్రభుత్వాం అంత బలమయినదిగా జాతీయ ప్రభుత్వం వుండబోదని విశ్వసిస్తున్నాం. అది మళ్ళా తప్పునిర్ణయం. 1. జాతీయప్రభుత్వవాంఛ కాంక్షణ లేకపోవటంచేత బుద్ధిపూర్వకంగా అధికారాన్ని హస్తగతం చేయటంద్వారా జాతీయప్రభుత్వం స్థాపించబడుతుంది. దానిఅర్థం, సామ్రాజ్య రాజ్యాంగపు

బలవత్తరమైన, దౌర్జన్యయుతమైన, రాజ్యాంగ యంత్రమంతా, జాతీయ ప్రభుత్వానికి సంక్రమిస్తుంది. ఈనాడుకూడా ఆ రాజ్యాంగయంత్రం పెట్టుబడిదారుల ననుసరించే నడుపబడుతూ యుంది. ఇండియా భావిరాజ్యాంగ చట్ట నిర్మాతలు ప్రస్తుత రాజ్యాంగయంత్రాన్ని సమూలంగా మార్చబోరు. కావలసిందల్లా పైన ఇంగ్లీషువారిని తొలగించి వారిస్థానే భారతీయులను ఎక్కించటం; సర్వీసుల నన్నిటిని భారతీయులపరం కావించటం. కాని, ఈసర్వీసెస్ అన్నిటికి ముఖ్యమైన ఉక్కుయంత్రం అలాగే వుండిపోతుంది. కాబట్టి సివిల్ రాజ్యాంగశక్తిగా జాతీయప్రభుత్వం, ప్రస్తుతప్రభుత్వానికన్నా ఏమాత్రం బలహీనంగా యుండబోదు. ప్రస్తుత ప్రభుత్వం ప్రజా అసంతృప్తిని అరికట్టగలిగిందయితే మహాత్ముడిన్ని, ఇతర ప్రాపకంలో యున్న నాయకుల్ని, తనకు ప్రచారకులుగా, వుపయోగించుకుంటూ, అలాంటి అనుకూల పరిస్థితిలో తేలికగా వచ్చే ప్రజాప్రతిఘటనను జాతీయ ప్రభుత్వం అణిచివేయ గలుగుతుంది.

మిలిటరీగాకూడా, జాతీయ ప్రభుత్వం అనుకున్నదానికంటె కొద్దికాలంలోనే, భయంకరమైనదిగా తయారవుతుంది. మామూలు వస్తువుత్పత్తి, మారకాలవల్ల పెట్టుబడిదారుల కోరికల నెరవేరే అవకాశం లేకపోవటంచేత, రాబోయే ఫలితమిది. రక్షణను ఆధారంచేసుకొని పరిశ్రమలు నిర్మించబడతాయి. ఒకపక్క దేశంలో కొరత పెచ్చుపెరిగిపోతూయుంటే, ఇంకొకప్రక్క ఇండియా అధికోత్పత్తి విషమస్థితిని త్వరలో అనుభవించ గలదు. అయినప్పటికీ పెట్టుబడుదారులు తమ యంత్రాన్ని తుప్పుపట్టిపోనివ్వరు. పెట్టుబడిని పోగొట్టుకొనజాలరు. యంత్రాన్ని నడిపేందుకు, అవసరమైతే పోటెని పెంపుచేసేందుకు, ఇంకొకమార్గాన్ని అతను చేపడతాడు. అదే ఆయుధోత్పత్తి. జాతీయ ప్రభుత్వం, జాతీయసైన్యాన్ని ఒకదానిని, కలిగి వుండాల్సిందేగదా. పరదేశంమీదకు దండెత్తే వుద్దేశం దానికి.లేకపోవచ్చు. కేవలం దేశరక్షణకే కావచ్చు. ముస్లింసమస్య పరిష్కరించబడబోదు. పాకి

స్తాన్ సమస్య వుండనే వుంది. ఇండియామీద పదండెత్తవల్సిందిగా ముస్లింరాజ్యాలను ముస్లింలు ప్రోత్సహించవచ్చు. అప్పుడు పాకిస్తాన్‌కు వ్యతిరేకంగా అఖండ హిందూస్తాన్‌ను సంరక్షించేందుకు బలమైన సైన్యాన్ని అట్టిపెట్టటమే కాకుండా జాతినంతటిని మిలిటరీగా జాతీయప్రభుత్వం తయారుచేయాల్సివస్తుంది. ప్రస్తుతం దేశంలో తాండవిస్తున్న జాతీయత అటువంటి ప్రచారానికి బాగా పనికి వస్తుంది. జాతీయ ప్రభుత్వమే యుద్ధానికి ప్రోత్సహించకపోవచ్చు. దాని వెనుకవున్న శక్తులు ఆ ప్రచారాన్ని రెచ్చగొట్టి అందుకు ఆర్థికంగా తోడ్పాటు చేస్తాయి. కారణం పెద్దఎత్తున మిలిటరీ కార్యక్రమం అధికోత్పత్తి విషమ పరిస్తితినుండి ఇండియా పెట్టుబడిదారులు తప్పుకొనేందుకు తోడ్పడుతుంది. ప్రభుత్వం మార్కెట్టును గారంటీ చేయగలదు. కాబట్టి, ఆయుధాలనే వుత్పత్తిచేయటం, ఆయుధాలనే సరుకుగా అమ్మగల్గటం, జరుగుతుంది. ప్రభుత్వానికి పెద్దసైన్యాన్ని పెంచటానికి అనువుగా దేశంలో అధికసంఖ్యాకులయిన నిరుద్యోగు లున్నారు. అందువల్ల ఆపని సులువు అవుతుంది.

జాతీయప్రభుత్వాన్ని ప్రజాశక్తులలో కూలద్రోయటానికి అంచనా చేస్తున్న వామపక్షీయులతో బలవత్తరమైన రాజ్యాంగం జాతీయప్రభుత్వానికి అండగా వుంటుందని, దానికితోడుగా శక్తివంతమైన సైన్యం సిద్ధంగా వుంటుందని గుర్తించుకోవాలి.

కెరన్‌స్కీ ప్రభుత్వంలాగా, జాతీయప్రభుత్వం తోలుబొమ్మల్లాగా వచ్చిపోయేదికాదు, అది విప్లవ ప్రత్యాఘాతక శక్తులకోటగా తయారవుతుంది. దాని రక్షణక్రింద, పెట్టుబడి విధానం పురోవృద్ధిశక్తిగా కాక ఫాసిజంగానే వ్యవహరిస్తుంది. ఫాసిజం ఎలా బలవత్తరమయిన ప్రజావిప్లవోద్యమాలను అణిచివేయగలదో తెలుసుకున్నాం. కనుక జాతీయప్రభుత్వాల్ని గురించి తప్పుడువూహాలుపోక ప్రజాప్రభుత్వంకోసం కృషిసల్పటం శ్రేయస్కరం.

# కాంగ్రెసు వుద్యమం

"స్వరాజ్యం" కోసం కాంగ్రెస్ సత్యాగ్రహ వుద్యమాన్ని కొనసాగిస్తూ వున్నది. స్వరాజ్యం కూడదని యేభారతీయుడు అనజాలడు. అయితే కాంగ్రెస్ కోరే స్వరాజ్యం యెలాంటిది? అసలు స్వరాజ్యం మనకెందుకు? నేడున్న ఆర్థిక సాంఘిక సమస్యలను పరిష్కరించుకొనేందుకే. వాటిని ఎలా కాంగ్రెస్ పరిష్కరిస్తానన్నది? కాంగ్రెస్ నామకా సంపూర్ణ స్వరాజ్య తీర్మానాన్ని చేసినా, అది ఆచరించేది గాంధీ సిద్ధాంత ఆశయాల్నే. అందువల్ల గాంధీసిద్ధాంతాలనుండి కాంగ్రెస్ సిద్ధాంత ఆశయాలను వేరు చేసేందుకు వీలులేదు. అయినప్పుడు గాంధీసిద్ధాంతాలేమిటి? గాంధీ పరిష్కార మార్గమేమిటి?

"పెట్టుబడిదార్లు కార్మికులకు ధర్మకర్తలు. జమీందారులు రైతులకు ధర్మకర్తలు. వారు వుండాలి; వీరువుండాలి. ఇద్దరు వర్గసామరస్యంతో మెలగాలి." ఇది యెలావుంది? ఇక స్వరాజ్యం ఎందుకు? వున్న ఆర్థికవ్యవస్థ అలాగే వుండిపోతే వచ్చే రాజకీయ అధికారం యేమి చేసుకోను? ప్రజల యీతిబాధలు యెలాపోతాయి? వాటిని పోగొట్టలేని రాజరికం, ప్రభుత్వం ఏదైతేనేమి? నల్లవారిదైనంత మాత్రాన వరిగేదేముంది? అలాంటప్పుడు అందుకోసరం జరిగే వుద్యమం ప్రజావుద్యమం యెలా అవుతుంది? ప్రజలకేమిటి సంబంధం?

అదీగాక ఈనాడు అంతర్జాతీయ విప్లవనిరోధక ఫాసిస్టుశక్తిని నిర్మూలించటం మన ప్రధానకర్తవ్యం; విప్లవధర్మం. దాన్ని నిర్మూలించినపుడే ప్రపంచములో స్వాతంత్ర్యం ప్రజాస్వామికాలు నిలుస్తాయి. అప్పుడే ఇండియా స్వాతంత్ర్యాన్ని పొందేందుకు వీలుంటుంది. కనుక ఫాసిస్టు వ్యతిరేక పోరాటం నేడు ఇండియా స్వాతంత్ర్య పోరాటం. సమస్త ప్రపంచ పీడిత ప్రజాబాహుళ్యంయొక్క స్వేచ్ఛాపోరాటం. ఇట్టిపోరాటంలో విజ

యాన్ని చేపట్టటం యెలా? కేవలం మిలిటరీశక్తితో నియంతలయుద్ధ తంత్రాన్ని ఛేదించజాలం. అందుకతోడు ప్రజాప్రతిఘటనాశక్తి అత్యవసరం. దాని ప్రాముఖ్యాన్ని అందరు ఆమోదించిందే. మరి దాన్ని పొందటంయెలా?

అదే ఇప్పటి ముఖ్యసమస్య. ప్రజాప్రతిఘటనాశక్తిని పొందాలంటే ప్రజావుత్సాహాన్ని చూరగొనాలి. ప్రజావుత్సాహాన్ని చూరగొనేందుకు, దేశానికి రానున్న అపాయాన్ని ప్రజలకు విప్పిచెప్పటంతోబాటు, వారికున్న కష్టనిష్ఠూరాలను తొలగించే మార్పులను ప్రభుత్వంలో తీసుకు రాగలగాలి. ఆనాడే దేశరక్షణ సాధ్యపడుతుంది.

కాని వాటిని బ్రిటను చేయలేదన్న వంకతో, కాంగ్రెస్ ఇప్పట్లో తీసుకున్న వైఖరివల్ల ఈపని యెలా నెరవేరుతుంది? దేశరక్షణ ఎవరిఅవసరం? బ్రిటిష్‌వారికన్న మన అవసరం యినుమిక్కిలి. కారణం, దేశం మనది. మన దేశం ఇంకా బానిసత్వంలోకి, మధ్యయుగాలనాటికి పోబోతూవుందిగనుక, దాన్నిబట్టి ఇప్పటి బ్రిటిష్ వ్యతిరేకవైఖరి ఎవరికి లాభం? బ్రిటిష్‌పై ద్వేషం, ద్వేషంగా వున్నందువల్ల వచ్చే ప్రమాదం లేదు. కాని అదే ద్వేషం మన దేశంలో ఫాసిస్టు సానుభూతిగా పరిణమించింది. పరిణమిస్తూ వున్నది. ఆస్థితిలో ప్రజా ప్రతిఘటనాశక్తిని ఎలా నిర్మించడం? బ్రిటిష్‌పై ద్వేషానికి బ్రిటన్ కొంతవఱకు కారణం కావచ్చు. అందువల్ల అది కారణంగా తీసుకొని, దాని తప్పులు వ్రేలుబెట్టి చూపుతు మనవిధిని, మన ధర్మాన్ని మఱువడం ఆత్మవంచన చేసుకోవటం అవుతుంది. ప్రజా ప్రతిఘటనాశక్తిని తనంతట తాను, కాంగ్రెస్ నిర్మించటానికి బదులు, అలా బలహీనపరచడం దేశరక్షణకు ఎలా దోహదమిస్తుంది? దేశరక్షణకు తగ్గ అంగబలం దేశంలో లేనప్పుడు వచ్చే స్వాతంత్ర్యం (వకటంటూవస్తే) ఎలా నిలబడుతుంది? అప్పటిదాక పొంచి కూర్చున్న శత్రువు దండెత్తి రాకుండా ఎలావుంటాడు? కనుక, ఎట్లాచూచినా ప్రస్తుత కాంగ్రెస్‌వుద్యమంవల్ల స్వాతంత్ర్యం రాకపోగా దేశీయఫాసిజం రాబోతుంది. ప్రజలు మేల్కొని, ఎదుర్కోవాలి. (11-11-42)

# ఎవరికి - ఎందుకు?

"మాకూ, వచ్చే శత్రువును యెదుర్కోవాలని వుంది. అయితే స్వాతంత్ర్యంలేదు. దాన్ని బ్రిటన్ యివ్వ నిరాకరిస్తూ వుంది. కనుక సత్యాగ్రహోద్యమం పెట్టకతప్పింది కాదంటూ" కాంగ్రెస్ చాటింది. పైకి ఇదంతా నిజమేననిపిస్తుంది. కాని అధికారాన్నిస్తే కాంగ్రెస్ ఫాసిస్టులతో యెలా పోట్లాడతానన్నది? "సాయుధ నిరాకరణతోబాటు అహింసాయుత నిరాకరణ" దీని అర్థమేమిటి? ఒకేసారి శత్రువుతో సాయుధంగానూ, అహింసాయుతంగానూ పోట్లాడటం యెలా? సంభవమా? అహింసాయుత నిరాకరణ, నిరాకరణ కావచ్చు. మనం నిరాకరణకోరేది, నిరాకరణకోసం కాదు. శత్రువును అరికట్టేందుకే. అది మన ఆశయం, మన సంకల్పం. అహింసాయుత నిరాకరణవల్ల ఫాసిస్టు వ్యతిరేక యుద్ధాన్ని యెలా గెలువగలం? దేశాన్ని ఫాసిస్టుల బారినుండి యెలా రక్షించగలం, అట్టి కాంగ్రెస్, దేశాన్ని రక్షించేందుకు ప్రభుత్వం అధికారాన్ని యివ్వలేదన్న సాకు ప్రజలకి చూపడం శోచనీయం.

నేడు కాంగ్రెస్ సారథ్యాన్ని వహించిన గాంధీమహాత్ముడిదివరలో "తనకు సామ్రాజ్యవాదం, ఫాసిజం రెండూ ఒకటేనని" వెలిబుచ్చాడు. అట్టి పితామహుని కనుసన్నలక్రింద నడుస్తున్న కాంగ్రెస్ హృదయపూర్వకంగా అక్షరాజ్యాలతో పోట్లాడుతుందనే గ్యారంటీ యేది? ఈనాటి ఫాసిస్టు వ్యతిరేక యుద్ధాన్ని విజయవంతంగా కొనసాగించాలంటే ప్రజలనుండి బయలుదేరిన గోరిల్లా సైన్యం అత్యావశ్యకం. దాని ప్రాముఖ్యాన్ని నెహ్రూ పండితుడు నొక్కిచెపితే, గాంధీ ఆయననోరు నొక్కివేశాడు. అది మూడురోజుల ముచ్చటేనన్నాడు. ఇలాంటి ఆదర్శాలతో గూడిన నాయకశిఖామణులకు అధికారాన్ని అంటగట్టడంవల్ల ప్రయోజనం యేమిటి?

అసలు ఇప్పుడు అధికారం దేనికి? ఫాసిస్టులతో చిట్టచివరవరకూ

పోరాడి విజయం సంపాదించేందుకు. కనుక, నమ్మకంలేనివారి చేతుల్లో ప్రభుత్వం అధికారాన్ని యెందుకు వుంచాలి? ఆ స్థితిని దేశీయులు మాత్రం యెందుకు కొనితెచ్చుకోవాలి? పైగా కాంగ్రెసే దేశంకాదు. ఇతరరాజకీయ పార్టీలున్నాయి. దేశాన్ని రక్షించాలని అవీ యువ్విళ్ళూరుతున్నాయి. వాటితో కాంగ్రెస్ రాజీకి రాగలిగిందా? లేదు. ఇలా రాజీకి రాలేనందుకు బ్రిటీషే కారణమా? వారురాకముందు దేశంలో విభేదాలు లేవా? వాటికి బాధ్యులెవరు?

నిజస్థితిని ఇలా పెట్టి, సత్యాగ్రహ ఉద్యమం పెట్టి, ముందు "బ్రిటన్ భారతీయుల్లో ముస్లిములకే అధికారాన్నంతా ఇచ్చినా సరే మా ఆమోదం అంటూ ప్రకటించిది." అయితే ముస్లిం జాతి కోరే స్వయంనిర్ణయ హక్కు (స్వరాష్ట్రపరిపాలన హక్కును) కాంగ్రెస్ యెందుకు ఆమోదించదు? ఆ హక్కునే బ్రిటన్‌నుంచి కాంగ్రెస్ కోరటంలేదా? ఈవిధంగా ప్రచారం కోసం తప్ప క్రియలో కాంగ్రెస్ దేశరక్షణ బాధ్యతను విడనాడింది. విడనాడటంతోనే వూరుకోక, దేశాన్ని ఫాసిస్టులకు బలిఇచ్చేందుకుపూనుకుంది. లేకుంటే ఇప్పటి సత్యాగ్రహోద్యమం వల్ల రాబోయే ఫలితమేమిటి? జాతీయత స్వాతంత్ర్యం కాకపోగా దేశవినాశమవుతుంది. దానితోబాటు ప్రపంచ స్వాతంత్ర్య ప్రజాస్వామికాలకు హాని. ప్రజలు ఈ ఆపత్తును గ్రహించి మేల్కోవాలి.

28—10—42

# దేశ రక్షణ ఎవరిపని?

"బ్రిటిష్‌వాళ్ళు వెళ్ళిపోతే దేశంలో, అరాజకం, అల్లర్లు, గందర గోళాలు, బయలుదేరుతాయన్న అవకాశాన్ని కాంగ్రెస్ గుర్తించకపోలేదు. జాతీయ గౌరవానికి, స్వాతంత్ర్యానికి అడ్డుగా నిలిచిన బ్రిటిష్ అధికారాన్ని తొలగించగలిగితే కాంగ్రెస్ సంతృప్తి పడుతుంది. దానికి మినహా కాంగ్రెస్ ఆలోచించదు; ఆలోచించజాలదు. స్వదేశంలో దిగిన సేనలు పెడుతున్న ఇక్కట్టులకే ఇపుడు ప్రజలు విసుగు జెందుతున్నారు. ఇక రేపో మాపో దండెత్తి రాబోయే సేనలసంగతి వారికెందుకు? కలరాతో పీడింపబడుతున్న రోగికి రాబోయే ప్లేగుసంగతిఆలోచించాల్సిన అగత్యమేమిటి?" అని కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి క్రిప్లానీ వాదన.

దీనినిబట్టి రేపు రాబోయే దండయాత్రకు జాతీయవాదులు విముఖంగా వున్నారని తేల్తూవుంది. బ్రిటిష్‌వారే వారికి ఒకటో నెంబరు శత్రువు. బ్రిటిష్‌వాళ్ళు ఇక్కడ వున్నపక్షంలో దేశం దండయాత్రకు లోనైనప్పటికీ జాతీయవాదులు దేశీయ రక్షణకోసం యేమీ చేయరారు. ఒకటో నెంబరు శత్రువుమీదున్న ద్వేషంమూలాన ఆశత్రువు ఓడిపోవటాన్నే వారు కోరుతారు. దాని అర్థం రేపు ఎత్తివచ్చే శత్రువు విజయాన్ని సహజంగా వారు కోరటం అవుతుంది. అట్టి దెప్పుడూ రాజకీయాదర్శం కానేరదు. అది జాతిద్వేష మనే దుర్వ్యాధి అవుతుంది. ఇలాంటి దుర్వ్యాధితో కూడిన మన జాతీయ రాజకీయ వాతావరణంలో, జాతీయత లిచ్చే శత్రువుకు మద్దతుగా పనిచేస్తుంది.

ఇట్టి దేశీయ విచిత్రపరిస్థితిని మనసులో పెట్టుకుంటే నేతప్ప రాబోయే దండయాత్రను యెదుర్కొనేందుకు ప్రజా ప్రతిఘటనా శక్తిని ఇనుమడింపజాలం. ఇప్పటి దేశీయ పరిస్థితుల్లో జాతీయత దేశరక్షణకు పనికిరాదు. కనుక జాతీయ పార్టీల నన్నిటిని కలుపుకోవాలన్న ప్రయత్నాలన్నీ నిష్ఫ

యోజనాలు, అవి సఫలం కాజాలవు. ఇప్పుడది తేటతెల్లం. ఇంతకుమించి వేరే త్రోవలేకపోతే యుద్ధప్రయత్నాల కనుకూలంగా ప్రజలను సన్నద్ధం చేయలేం. ప్రజల ఉత్సాహం, ఐచ్ఛికతోడ్పాటు, లేందే రాబోయే దండయాత్రనుండి ఇండియాను రక్షించజాలం.

ఇండియా రక్షణకు ఇప్పట్లో తయారుగావున్న సేన ప్రజలనుండి విడిపోయివుంది. అందులోని భారతీయసేన ప్రజలకు, సేనకువున్న ఈ విముఖత్వాన్ని పోగొట్టజాలదు. కారణం భారతీయ సేనకూడా జీతభత్యంమీద ఆధారపడిందే. పైగా బ్రిటిష్ ద్వేషమే జాతీయ వాదంనుండి బయలుదేరింది. కనుక తీరా యుద్ధసమయంలో అంతర్గతంగా సైన్యంలో సైన్యం తిరుగబడే అపాయంవుంది. సేనలోవచ్చేది సాయుధ తిరుగుబాటు కానక్కరలేదు. అది మూకీ భావంతో కూడిన సహాయ నిరాకరణమాత్రమే కావచ్చు. అయినా అది చాలా ఉపద్రవమైంది. దాన్ని యెలా పోగొట్టటం? ఇదే నేటి ఇండియా రక్షణలోని ముఖ్యసమస్య. ఈ సమస్య జాతీయ దృక్పథంతో పరిష్కరించలేం. కారణం ఆసమస్యను జాతీయత సృష్టించిందే.

బ్రిటిష్ వాళ్లు వదిలిపోతే ఇండియాను మేము కాపాడుకోగలమని జాతీయ వాదులు గప్పాలు కొట్టవచ్చు. కాని బ్రిటిష్‌వాళ్లు వెళ్ళిపోతే ఇపుడు దేశరక్షణకున్న సేన అప్పటికి దేశంలో దండయాత్రను ఎదుర్కొనేందుకు లేకపోవచ్చని వారే ఒప్పుకుంటున్నారు. ఇందుకు గాంధిగారు చెప్పిందే నిదర్శనం.

"బ్రిటిష్, అమెరికా సేనలు ఇండియాను విడిచిపోతే చైనాకు ముప్పు సంభవించవచ్చు. దానితోబాటు ఇండియాకు ప్రమాదం జరుగవచ్చు."

అయినప్పటికీ ఒకే సూత్రాన్ని బట్టుకొని బ్రేళ్ళాడుతూ బ్రిటిష్‌వారు వెళ్ళిపోవాలని ఒత్తి పలుకుతున్నారు.

ఇది ఇండియా, బ్రిటన్‌ల మధ్య సమస్య అయినట్లయితే బ్రిటిష్ వారిని వెళ్ళిపొమ్మనటం మంచి సలహాయే. ఇండియా అలాంటి సాహసా-

నికి పూనుకోవచ్చు. కాని ఇతరుల స్థితికి హాని కల్గించేందుకు ఇండియాకు హక్కు వుందా ? ముదిరిపోయిన జాతీయతకు, కృశించిపోయిన సామ్రాజ్యవాదానికి సంబంధించిన సమస్య కాదిది. ఇండియారక్షణ ప్రపంచ స్వాతంత్ర్యరక్షణ. చైనా, రష్యా ఇంకా ఇతరదేశాల భద్రతకోసం ఇండియారక్షణ అత్యావశ్యకం. కనుక ఒకటోనెంబరు శత్రువైన బ్రిటన్‌ను సాధించాలన్న ఆవేశంతో కూడిన జాతీయవాదులకు భారతదేశ రక్షణను వదలివేయరాదు. అటిస్థితిలో జపాన్‌గాని, ఇతర అక్షరాజ్యాలుగాని ఇండియాను కబళిస్తాయి. దాని వెంటనే ఇతర ప్రపంచ దేశాల మొత్తానికి అపాయం కలుగుతుంది.

ఇతర దేశాల రక్షణ ఇండియా ఆత్మరక్షణమీద ఆధారపడి వుంది. ఆ కారణంచేత ప్రపంచ యుద్ధక్షేత్రంలో అంతర్జాతీయ బలగం, ప్రబల ఫాసిస్టు శత్రువుల నుండి దాన్ని కాపాడాల్సి వుంది. అలాంటి అవసరం లేదనవచ్చు. ఆ పక్షంలో భారతీయులు తమ దేశరక్షణ బాధ్యతను తమంతట తామే నిర్వహించగలిగి వుండాలి. అప్పుడుకూడా అది జాతీయరక్షణ అనిపించుకోదు. ప్రపంచ యుద్ధంలో ఒకరంగంలో ఇండియా సంరక్షింపబడుతుంది. దాన్ని రక్షించేది యేసైన్యమైనా, భారతీయసేన అయినా అంతర్జాతీయంగా పోరాడే సేనలో అర్ధోక భాగంగా వుంటుంది. భారతదేశరక్షణ దాని జాతీయ పొలిమేరను అతిక్రమించి పోవాలి. కనుక దాని రక్షణకు నేటి జాతీయత కంటగింపుగా వుండటంలో ఆశ్చర్యమేమీ లేదు.

అయితే యింకోమార్గం లేదా ? జాతీయవాదులు ఊహించిన అల్లరకు, అరాజకాలకు భారతదేశం గురికావాల్సినదేనా? బ్రిటిష్ అమెరికా వారు, నిష్క్రమించటంవల్లగాని, ఇంక అంతకు తక్కువైన అధికారాన్ని జాతీయవాదులకు అంటగట్టటంవల్లగాని ఇండియాకు ఆగతి తప్పదు. చురుకుగాగాని, ముభావంతోగాని, ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని, తెలిసిగాని, తెలియకగాని జాతీయ శత్రువుకు అండగా నిలవడమైనా జరుగు

తుంది. దాని ఫలితంగా ఇండియాకు, మలయా, సయాం బర్మాలగతి పడు తుంది. ఇందులో యేదో ఒకటి జరగక తప్పదు.

కాని ఇంకోమార్గం లేకపోలేదు. జాతీయతకు హద్దులు తెలిసినవారు, అనుభవం వల్ల దేశీయ స్వాతంత్ర్య పోరాటం ఒంటరి పాటుగా సాగేందుకు వీలు లేదని గ్రహించిన అనుభవజ్ఞులు స్వాతంత్ర్యయోధులున్నారు. వారు సంఖ్యలో అధికంగా లేకపోవచ్చు. కాని జాతీయవాదులు మాత్రం యేమంత అధికంగా వున్నారు? ప్రజాబాహుళ్యం జాతీయకక్షలోనిది కాదు. నిస్సందేహంగా వారు కొంతవరకు జాతీయ ప్రచారానికి లోనైనారు. కాని ఇంకో ఏకమైన ప్రచారాన్ని చేయగలం. దాని పర్యవసానంగా ప్రజలను సక్రమ మార్గాన నడుపగలం.

కాంగ్రెస్ సెక్రెటరీ "జాతీయ గౌరవాన్ని స్వాతంత్ర్యానికి అడ్డు వచ్చే బ్రిటిష్ పరిపాలనాన్ని తొలగిస్తే కాంగ్రెస్ తృప్తిపడుతుం"దని చెప్పాడు. ఇంతకుమించి కాంగ్రెస్ ఆలోచించే దేమీ లేదనీ మరీ మరి చెపుతున్నాడు. అది ప్రజలను తృప్తిపరుస్తుందా? కాంగ్రెస్ సెక్రెటరీ 'అవు' నంటున్నాడు. ప్రజల మనస్తత్వాన్ని అతడు గ్రహించలేదు. పోనీ ప్రజలకు యేమి కావాలో అతను తెలుసు కొనేందుకు ప్రయత్నించడు. బ్రిటిష్ వారిని ప్రజలు పోవాలంటున్నారంటే బ్రిటిష్ వారివల్లే వారనుభవించే నేటి దారిద్ర్యం సంభవించిందని వారు వినివుండటం వల్లనే. కాని బ్రిటిషువారు పోవటమే ప్రజలకు అంత్యం కాదు; ఆదర్శం కాదు. వారి ఆదర్శాని కదొక సాధనం; మార్గం. జాతీయవాదులకు బ్రిటిష్‌వారు పోవటమే అంత్యం. వారంతకు మించి ఆలోచించరు. ఆలోచించజాలరు. ఆలోచించక పోవటంలోని దుర్బలత్వాన్ని క్షమించవచ్చు. ఆలోచించటానికి నిరాకరించ టంమాత్రం విచిత్రం. ఈ నిరాకరణఉద్దేశ్యం దేన్నో కొంత మభ్యపర చటమే. బ్రిటీషువారు వెళ్ళిపోవటం మినహా తరువాత యేమి జరిగేది జాతీయ వాదులు ఆలోచించరు. కారణం తరువాత యేమిజరిగినా వారికే

పట్టదు. బ్రిటిష్‌వారు పోవటంలో ఇంకోపరదేశం మనమీద పెత్తనం చేయవచ్చు. కాక జాతీయ ప్రభుత్వ మేర్పడవచ్చు. అలాంటి జాతీయ ప్రభుత్వంలో ఇపుడున్న ప్రాథమిక స్వాతంత్ర్యాణువులైనా ప్రజాసామాన్యానికి ఉండక పోవచ్చు.

దేశరక్షణ విషయంలో జాతీయవాదులు పూర్తినిరాకరణవల్ల తక్కిన వారికి, ప్రజా సామాన్యంలో అట్టివారి పలుకుబడిని విచ్ఛిన్నం చేసేందుకూ మంచి అవకాశం దొరికింది. ప్రజలు వెనుకబడి వుండటంవల్ల, అమాయకులౌటంవల్ల వాటిని అండగా జూచుకొని జాతీయ వాదులు వారి పలుకుబడిని ఇన్నాళ్లు నిలబెట్టు కుంటున్నారు. ఉన్నపరిస్థితి వున్నది వున్నట్టుగా జాతీయ వాదులకు విరుద్ధంగా ప్రజలకు తెలియజెప్పితే, వారిపై అలముకొని వున్న జాతీయమత్తు వదలిపోతుంది. కాని ఇలాంటి విజ్ఞప్తి మాటలతోనేకాదు చేతలతో చూపించాలి. ప్రచారరూపకమైన విజ్ఞప్తికూడా చాల అవసరం. కాని పెద్దయెత్తుమీద ఈ ప్రచారం సాగాలి. ఈ ప్రచారంలో జాతీయ వాదుల రోదనం అణిగిపోవాలి.

జాతీయ వాదులు కోరేదానికి, ప్రజాసామాన్యం కోరేదానికి, చాలా తేడావుంది. ప్రజాసామాన్యానికి స్వాతంత్ర్యంగాని, స్వేచ్ఛగాని ఊహాతీతమైనవికావు. గౌరవం, ప్రతిష్ఠ, ఆసేవ్యవీరిసూత్రాలకు సంబంధించినవికావు. ప్రజాసామాన్యం వారి సాధారణ రోజువారీ జీవితకష్ట నిష్ఠురాలనుండి, దారిద్ర్యన్నుండి, సాంఘికదోపిడినుండి, స్వేచ్ఛను కోరుతున్నారు. కేవలం బ్రిటిష్ పరిపాలకులవల్లనే ఇలాంటి స్వేచ్ఛ హరించబడలేదు. వారు రాక ముందు హిందూదేశంలో దారిద్ర్యంవుంది. కాని స్వదేశస్థులైన భారతీయులే దాన్ని వారించారు. ప్రజల కేవిషయం యెవరైతే తెలియదంటారో వారు ప్రజల మనస్తత్వాన్ని గ్రహించలేదన్నమాట. ప్రజల్ని గురించి అట్టివారు మాట్లాడేది వారిని మోసపుచ్చేందుకే. బ్రిటిష్ అధికారం తొలిగిపోవుటతోనే విధిగా ప్రజలకు కావలసిన స్వేచ్ఛలభించదు. జాతీయ స్వాతంత్ర్యమంటే

# దేశరక్షణ ఎవరి పని ?

ప్రజాస్వాతంత్ర్యం కానక్కరలేదు. బ్రిటిష్, అమెరికా వారిని వెళ్ళగొట్టటంతో జాతీయ వాదులు జయిస్తే, దేశానికి అల్లర్లు, అరాచకం, తప్పవు. అటిస్థితి ప్రజాజీవితాలకు మరీ దుర్భరం, భరించరానిది. దీన్ని తేలికగా ప్రజలకు విప్పి చెప్పగలం. మూఢవిశ్వాసాలకు లోనైనట్టి జాతీయతకు లోనుగాక, ప్రజలకు కావలసిన స్వేచ్ఛను గుర్తెరిగినవారే, అలా చెప్పేటందుకు తగినవారు. కనుక వారే ఈనాడు సహజమైన ప్రజానాయకులు. అంతర్జాతీయ యుద్ధరంగం లోని ఇండియా రక్షణలోవున్న బలహీనతను, ప్రజల నాయకత్వపరచటంతో వారే పెరికివేయగలరు. అందువల్ల భారత దేశరక్షణను నిర్మించగలవారు వారే. నేడు జాతీయ యుద్ధరంగమంటూ వుండజాలదు. అంతర్జాతీయ యుద్ధంలో ఒక రంగాన్ని ఇక్కడ నిర్మించితీరాలి; నిర్మించగలగాలి.

ఇండియారక్షణ సమస్యను యెవరైతే పరిష్కరించగలరో వారిని ఇంకా ప్రభుత్వం విశ్వసించటంలేదు. ఇట్టి అంతర్జాతీయ దృక్పథంగల వారిని దగ్గిర చేర్చటంకన్న ప్రభుత్వం దాన్ని ఒకటోనెంబరు శత్రువుగా పరిగణించే జాతీయ వాదులకే అధికారాన్ని అంటగట్టాలని చూస్తూవుంది. అలాంటి అంతర్జాతీయ దృక్పథం గలవారు. జరూరుగా విప్లవకారులు అయిన కారణం చేత ప్రభుత్వం వారంటే విముఖంగా వుంది. అందువల్లే వారు ప్రపంచ యుద్ధంలో ఇండియారంగంలోని యుద్ధభూములకు ప్రజలను దూకించగలరు.

అంతర్జాతీయవాదులను కలుపుకోక పోవటానికి వారి పై ప్రభుత్వం మోపే నెపం, ప్రజల నిస్సహాయతను, నిరుత్సాహాన్ని పోగొట్టేందుకు జాతీయ సంస్థలు, మత సంస్థలతో వారు పోటీ చేయలేరని, కొన్ని కారణాలతో చేయగూడదనుకున్న కార్యాన్ని చేయక పోవటానికి చెప్పే సాకుమాత్రమే అది అవుతుంది. సనాతనత్వంతో గూడి మొండిఘటాలైన బ్రిటిష్ అధికారులు వారి శత్రువు లగు జాతీయవాదులకిచ్చే సగం సహాయాన్నైనా జాతిద్వేషాల వల్ల మూఢులు కానట్టి స్వాతంత్ర్యయోధులకిచ్చినా, వారు కోట్లాది గా ప్రజలను యుద్ధానికి నడిపించగలరు.

# దేశరక్షణ ఎవరి పని ?

అంతర్జాతీయ దృష్టిగల భారతీయులకు అధికారాన్ని ఇవ్వాలి. అప్పుడు ప్రజల సహాయాన్ని యెలా పొందాలో అలా పొందేందుకు వారు అధికారాన్ని కలిగి వుంటారు. అలా జాతీయ ఆవేశపరులను వోడించి వేయగలరు. గొప్ప గొప్ప వాగ్దానాలు చేసినదానికన్నా ఆచరణలో చేసి చూపెట్టిందే ప్రజా హృదయాన్ని చూరగొంటుంది.

దేశంలో రాజకీయ సంస్థ అయిన రాడికల్ డెమొక్రటిక్ పార్టీ ఒక్కటే సరైన అంతర్జాతీయ దృక్పథంతో పనిచేస్తూ వుంది. మొదటనుంచీ అది ఒక్కటే ఈ యుద్ధ స్వభావాన్ని గ్రహించి, అది యెలా మారేందుకు వీలుందో అవగాహనచేసుకొని, అలాంటియుద్ధంలో ఇండియాపాత్ర యెలాంటిదో చూపెట్టింది. జాతీయ వైషమ్యాలకు అది యెదురీత ఈదవలసి రావటంవల్ల ప్రజా బాహుళ్యంలోకి త్వరగా దూసుకొని పోలేకపోయింది. ఈ జాతీయ వైషమ్యాలు ప్రపంచ స్వాతంత్ర్యంతోబాటు ఇండియా స్వాతంత్ర్య లక్ష్యానికి చీడపురుగుల వంటివని రాడికల్ డెమొక్రటిక్ పార్టీ యేనాడో గ్రహించగలిగింది. రాడికల్ డెమొక్రటిక్ పార్టీ ఇచ్చిన కార్యకలాపంతో ప్రభుత్వం పనిచేస్తేనే తప్ప ఇండియా రక్షణసమస్య పరిష్కారం కాజాలదు. దేశంలో ఇంకేపార్టీ ఇచ్చిన కార్యకలాపమైనా ప్రజలను పెడత్రోవనుబట్టిస్తుంది.

కమ్యూనిస్టుపార్టీ అంతర్జాతీయ దృష్టి వున్నదని అనుకోబడుతూ వుంది. కాని ఈనాడు అది అలా ప్రవర్తించటం లేదు. జాతీయవాదుల కోర్కెను బలపరుస్తూ వుంది. పైపైను ప్రభుత్వంలాంటి జాతీయ ప్రభుత్వమే (కాంగ్రెస్, ముస్లింలీగుకలసి) ఫాసిజాన్నుండి ఇండియాను సంరక్షించగలదన్న విచిత్ర ధోరణిని అదిఅవలంబించింది. ఇండియాలోని ఫాసిజాన్ని గుర్తించుట లేదు. ఈ తప్పు లన్ని పేరు ప్రతిష్ఠలు నిలబెట్టుకోవాలనే ఆతురతతో చేస్తున్నట్టు కనబడుతూ వుంది. జాతీయ వైషమ్యాలపై ఆధారపడి సంపాదించిన పేరు ప్రతిష్ఠలు ప్రజల నాయత్తపరచటానికి యెందుకూ పనికిరావు. పైగా అందుకు అడ్డువస్తాయి. ప్రజలను ఒకపనికోసం ఆయత్తపరచాల్సి వుంటుంది.

అదే జాతీయతయొక్క పని అయితే వారు ప్రజాయత్తపరచటం ఫాసిస్టువ్యతి రేకతను కూడనిపని. ప్రపంచయుద్ధరంగానికి ప్రజలను ఆయత్తపరచాలసివుంది. కమ్యూనిస్టులు కమ్యూనిస్టులుగా పనిచేయటంలేదు. పెటీ బూర్జువా జాతీయ వాదులుగా మాత్రమే పని చేస్తూవున్నారు. జాతీయత అనే అంటుజాడ్యం కమ్యూనిజాన్ని నరనరాలకూ తినివేస్తూవుంది.

కాని, చరిత్ర తన తీర్పు చెప్పివేసింది. ప్రస్తుత ప్రభుత్వంకూడా అంతర్జాతీయ వైఖరి తాల్చేటట్టు చేయబడుతూవుంది. లేకంటే అది దండ యాత్ర నెదుర్కోలేదు. ప్రభుత్వం అంతర్జాతీయం చేయబడే ఈక్రమం భారతీయులకు పరిపాలన అప్పజెప్పితే తప్ప పూర్తికాదు. భారతీయుల ఆమోదం లేందే భారతదేశం సురక్షితమైన యుద్ధరంగంమాత్రం కాజాలదు. అమెరికా నుంచి వచ్చే టాంకులు, విమానాలు, తుపాకులు బయట దాడిని యెదుర్కో వచ్చు. కాని దేశంలోపల అంతటా అలుముకొని వున్న ప్రమాదం కలిగించే శక్తులను యెదుర్కొనేందుకు మాత్రం, అవి యెందుకూ పనికిరావు. కనుక అంతర్జాతీయ యుద్ధంలోని ఇండియా రంగాన్ని బలవత్తరం చేయటానికి ప్రజలను సమాయత్తపరచితీరాలి. ఇండియా ప్రజల తోడ్పాటు జాతీయవాదుల వల్లగాని వారి ద్వారా గాని లభించదు. సహజంగా జాతీయవాదులు ఇండియాను ప్రపంచ యుద్ధరంగాన్నుండి దూరంగా తీసుకుపోతారు.

వారు దాన్ని మభ్యపరచలేరు. బహిరంగంగాకూడా వారి వుద్దేశాన్ని నెరవేర్చుకొనేందుకు దేశాన్ని అరాజకానికి అల్లరికైనా అప్పజెప్పేందుకు వారు వెనుదీయటంలేదు. ఇండియా ప్రజాసామాన్యానికి ప్రపంచయుద్ధరంగానికి, కీలకంగా పనిచేయగలిగినవారు అంతర్జాతీయ మనస్తత్వం గలిగిన భారతీయులే. వారేవిశ్వసింప దగ్గవారు. కాని తక్షణ కార్యాచరణమాత్రం అవసరం. వారు చేయాలని ఆసక్తితో వున్న పనిలో, ప్రస్తుతం పీసంకూడా వారు చేయలేని స్థితిలోవున్నారు. ఈ పరిస్థితిని మార్చేందుకు తామేమి చెయ్యాలి ? ప్రభుత్వం యంత్రంద్వారానే విజయవంతంగా, ఫలప్రదంగా,

వారాపని నెరవేర్చగలరు. ప్రపంచమంతా వ్యాపించియున్న ఈ యుద్ధంలో సరైన దిక్కుకు ప్రజల నడిపించ గలిగిన యోధులకే ప్రభుత్వ యంత్రాన్ని అందుబాటులో వుంచాలి.

ఈ యుద్ధంలో ఆదినుంచీ రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ ఒక్కటే, ప్రజాహితమైన అంతర్జాతీయ దృక్పథంతో, యీ యుద్ధంలో పాల్గొనాలని ప్రచారంచేస్తుంది. ఈ యుద్ధంలో పాల్గొనటానికి, యీ యుద్ధతత్వాన్ని, ప్రజలహక్కులను వున్నవరకైనా కాపాడుకోటానికనేకాక, ముఖ్యంగా మూడు కారణాలు చూపింది: 1. ప్రభుత్వపద్ధతులు క్రమేణ ప్రజాస్వామ్యంగా మారుతై, 2. దేశంలో ప్రస్తుతం ప్రబలివున్న యీ పిరికి, మందమతి వాతావరణంపోయి, మిలిటరీదృష్టి, తద్వారా (ముఖ్యంగా క్రిందిజాతులికి) చైతన్యం కలుగుతుందని, 3. విదేశాలనుండి సరఫరాలు రానికారణంగా, మన దేశంలో విపరీతంగా పరిశ్రమాభివృద్ధి జరిగించుకోవచ్చుననీ—ఇంకేవీ జరక్కపోయినా యీ మూడైనా నెగ్గితే మనదేశం, చాలవరకు ప్రజాస్వామ్య యుగంలోకి అడుగుబెట్టగలుగుతుందనీ, చెప్పింది.

ఇంతేగాక, దేశంలో కొనుగోలుశక్తి పెంచి, వుత్పత్తిపెంచి, పరిశ్రమల నభివృద్ధిచేసుకుని, ప్రజాస్వామ్యశక్తిని యిబ్బడిగా పెంచుకోవచ్చునీ, సహకార సంఘాలద్వారా పంపిణియేర్పరచి, ఆర్థికవిధానంలోగూడా మధ్య కీలకాలను తీసివేయవచ్చని చెప్పింది.

ఇటువంటి ఆదర్శాలు గలవారే ప్రభుత్వంలోకి రావాలి.

—జూలై, 42.

# దేశవాళీ ఫాసిజం

ఫాసిజం అంతర్జాతీయ విప్లవ నిరోధకశక్తి. క్షీణించే పెట్టుబడి విధానపు అంతిమదశ. పడిపోనున్న పెట్టుబడి విధానాన్ని నిలద్రొక్కేందుకు పనికివచ్చే సాధనం. ఇలా అన్నప్పుడు ఫాసిజం, పెట్టుబడివిధానం అమల్లో వున్న దేశాల్లోమాత్రమే ఉంటుందని చెప్పటం కాదు.

ఫాసిజానికి, రాజకీయ ఆర్థికదశలతోబాటు సాంఘిక, నైతిక దశలున్నాయి. ఈ అన్ని దశలల్లోగాని, కాక ఇందులో ఏదో ఒక దశలోగాని, కొన్నిదశలలోగాని, ఫాసిజం ప్రపంచంలో అన్ని దేశాలలోను (ఒక్క రష్యాలో తప్ప) వుంటూ వస్తూనేవుంది. ముఖ్యంగా పెట్టుబడి విధానం క్షీణించిన దేశాలలో, దాని అన్నిదశలలో నగ్ననృత్యం చేస్తూ వుంది. ఆదేశాలు, జర్మనీ, ఇటలీ, జపాను; అవి కబళించిన ఇతరదేశాలు వాటితో కలిసిన దేశాలు.

ఈనాడు యుద్ధంమూలాన, ప్రపంచం అంతా రెండు ముఠాలుగా చీలిపోయింది. ఒకటి ఫాసిస్టు వ్యతిరేకముఠా, ఇంకొకటి ఫాసిస్టుముఠా. ఇండియాకూడా అలా రెండుముఠాలుగా విభజింపబడింది. అయితే, ఫాసిస్టు ముఠా యేది? దాని వ్యతిరేక ముఠా యేది? అనేవి తేల్చుకుంటే దాన్ననుసరించి శక్తుల సంబంధాలు తేలిపోతాయి. మనం తీసుకోవాల్సిన విధానం స్పష్టపడుతుంది.

ఫాసిజం పెట్టుబడిదారీ విధానాన్ని నిలబెట్టే బలవత్తరమైనసాధనం. అనగా పీడిత విధానాన్ని, దాని శత్రువులనుండి కాపాడే క్రూరాతిక్రూరమైన ఆయుధం, అని పైన తెలుసుకున్నాం. ఆ కాపాడరావడం పశుబలంవల్ల కావచ్చు, దుష్ప్రచారంవల్ల కావచ్చు, వేదాంత మతబోధలవల్ల కావచ్చు, కాక, ఆమాటినాధారం చేసుకొని కావచ్చు.

ఇక్కడ ఇండియాలో చాలవఱకు జమీందారీ విధానం అమల్లో

వుంది. ఫోర్డ్ గొప్పో పెట్టుబడిదారీ విధానం వుంది. విధానాలు వేరైనా, దోపిడీపద్ధతులు వేరైనా, దోపిడీ చేయగలశక్తులు వేరైనా, రెండూ దోపిడీ విధానాలే. వీటిని రక్షించే రాజకీయ అధికారం ఇప్పట్లో భారతీయ ధనాఢ్యవర్గానికి లేకపోయినా వారి దోపిడీపద్ధతిని, వారి ఉనికిని సంరక్షించే, సమర్థించే, నిలబెట్టే, వేదాంతయుతప్రచార బోధలున్నాయి. మన అవతార వాదం ఏమిటి ? మన కర్మసిద్ధాంతమేమిటి ? మన చాతుర్వర్ణ సిద్ధాంతా లేమిటి ?

ఇలా హిందూదేశం, ఫాసిజంతో, సాంఘిక, నైతిక చట్రాన్ని ఏర్పరచుకొంది. దీన్నే జాతీయఫాసిజంఅని, దేశీయఫాసిజం అని, నాటు ఫాసిజం అని, మనం పిలుస్తున్నామ్. ఈ ఫాసిస్టు సాంఘిక నైతిక దశల్ని చేబట్టి, ఎవరు సమర్థిస్తున్నారో వారు దేశీయఫాసిస్టులు. కానివారు వ్యతిరేకులు; తటస్థులు.

కాని చాలమంది వ్యక్తులు, పార్టీలు, తాము ఫాసిస్టు వ్యతిరేకుల మంటూ చాటుకోవడం జరుగుతూవుంది. అయినా, వారిని, వాటిని, మాట లతోకాక చేతలనుబట్టి నిర్ణయించుకోవాల్సివుంది. ఉదాహరణకు కాంగ్రెసును తీసుకుందాం. దాని ఆదర్శం (కాగితంమీద) సంపూర్ణస్వాతంత్ర్యం. ఫాసిజం అట్టి స్వాతంత్ర్యానికి వేరుపురుగు. అయినప్పుడు, బ్రిటన్‌మీద వంకతో, ఆ ఆదర్శంతోకూడిన కాంగ్రెసు, ఫాసిజంతో పోట్లాడపోకపోగా, దానికి అనుకూలవైఖర్ని తీసుకోవడం దేన్ని తెలియజేస్తూవుంది? బ్రిటన్ అధికారాన్ని ఇస్తే ఫాసిజం పరమశత్రువైనట్లు, లేకుంటేలేదా !!

పోగా, కాంగ్రెసు సిద్ధాంతాలు ఆచరణలో గాంధీసిద్ధాంతాలు. గాంధీసిద్ధాంతం నేడున్న ఆర్థికసమాజం అలాగే ఉండిపోవాలని. జమీందారీ విధానం, పెట్టుబడిదారీ విధానం ఆయన దృష్టిలో దైవసృష్టి. కనుక వాటిని నిలబెట్టేందుకు ఆయన హిందూజాతికున్న కర్మసిద్ధాంతాన్ని ప్రబోధిస్తున్నాడు. జనం, 'మహాత్ముడన్న' 'ధర్మాత్ముడు' అని బ్రహ్మరథం పడు

తూవుంది. ఇదెలా హిట్లర్‌వాదంతో ఛేదిస్తుంది? హిట్లర్ తాను దైవాంశ సంభూతుడనంటున్నాడు. జర్మన్‌జాతి పుట్టుకతో పాలించేవర్గంఅనీ, తతిమ్మా జాతులు బానిసజాతులు అనీ అతని సిద్ధాంతం. కాకపోతే అతనికి రాజకీయాధికారం చేతినిండావుంది. మన గాంధికిలేదు. అంతే తేడా.

ఇలాంటి దేశీయఫాసిజానికి ఆయువుపట్టైన గాంధీని, ఆయనపార్టీ కాంగ్రెసును అంటిపెట్టుకొని, ఆయనకి, దానికి అధికారాన్ని అంటగట్టాలని ప్రచారం చేస్తూవున్న కమ్యూనిస్టుల ఫాసిస్టువ్యతిరేకత ఎలాంటిది? బహుశా ఫాసిజం వారికి పరాయిదికాబోలు ! దేశీయఫాసిజం ఉన్నఠంటే వారికి గంగెత్తెడంలో ఆశ్చర్యపడాల్సిన పనిలేదు. ఫాసిజం అనేది, ఇంటా బయటా అంతటా ఉందని వారు గ్రహిస్తేగా!! తెలియనిదాన్ని ఒకరుమాత్రం ఏంచేస్తారుపాపం!! కొందరికి చెపితే వినిపించుకొనే సుగుణమైనా ఉంటుంది. వారికి మాత్రం అది ఎన్నడూలేదు. ఫాసిజంగుణమే అది.

# ఆదర్శాలు : మార్గాలు.

ఒక సంస్థనుగాని, ఒక పార్టీకిగాని, మరియొక వ్యక్తికిగాని, నాయకులనుగాని, వాటి, వారి ఆదర్శాలా, కాక వాటిసాధనమార్గాలా ప్రధానమైనవి? ఏదిముందు? ఏది వెనక? దేన్ననుసరించి ఏది వుండాలి?

ముం దీవిషయాలను తేల్చుకుంటేనే తప్ప, ఆదర్శాలెలాంటి భిన్నమైనవియైనా, దేశంలోని నాయకుల్నిగాని, వారి పార్టీల్నిగాని, మనం సరిగా అర్థంచేసుకోజాలం. అలా అర్థం చేసుకోకుండా, 'ఆయా' నాయకులను, సంస్థలను, పార్టీలను గురించి మాట్లాడటం సాహసమనిపించుకుంటుంది. వార్ని గురించి తప్పుడు అభిప్రాయాలను రావాల్సి వస్తుంది. ఇలావార్ని, ఇటు మనలను, వంచన చేసుకోవటం జరుగుతుంది. దానివల్ల ఉపయోగం లేక పోగా, అనర్థం వాటిల్లుతుంది.

అందుకని ముందు ఒకపార్టీ ఆదర్శమేమిటో, అదెలా దాన్ని సాధించ ప్రయత్నిస్తుందో, ఆచేయటంలో దేనికది ప్రాముఖ్యత ఇచ్చిందో, దానివల్ల ఏమిలాభాన్ని, కాక నష్టాన్ని పొందిందో, పరిశీలిద్దాం. దాన్నిబట్టి మనం ఒక నిర్ణయానికి రాగలం.

ఏబది సంవత్సరాల్లనుండి జాతీయ కాంగ్రెస్ స్వాతంత్ర్యం కోసం పోరాడుతూ వచ్చింది. ప్రారంభంలో పిటీషన్లతో బయలుదేరి, చివరకు స్వాతంత్ర్య ఆదర్శాన్ని ఆమోదించింది. తత్ఫలితంగా ప్రజలను ఆకర్షించింది. కాని స్వాతంత్ర్యం అంటే ఏమిటో, దాన్నెలా సాధించాలో చెప్పలేక పోయింది. ఇంతలో గాంధీగారి నాయకత్వం దానికి ప్రాప్తించింది. ఆయన చెప్పేదనే ఆదర్శం అహింసా ఆదర్శం. అహింస ద్వారానే స్వరాజ్యాన్ని సంపాదించాలన్నాడు. లేకపోతే, అలాంటి స్వరాజ్యం మొదలొద్దన్నాడు. అలా రెండుమూడు ఉద్యమాలు విఫలమయిపోయాయి.

ఆయన సారధ్యమన్నాళ్ళు, స్వరాజ్య ఆదర్శానికి కాక, దాన్ని

సాధించే మార్గానికి ప్రాముఖ్యత ఇచ్చాడు. అయితే భారతీయ ప్రజలకు కావల్సిందేమిటి ? వారికేది ముఖ్యం? భారతీయులకు కావాల్సింది, వారు కోరేది, స్వరాజ్యం. వారు దాన్ని ఎలా సంపాదించినా, దానితో వారికి నిమిత్తంలేదు. మొత్తంమీద సంపాదించడమే వారికి ముఖ్యం. అలాంటప్పుడు ఫలాన అహింసద్వారానే దాన్ని సాధించాలని హద్దు పెట్టడం ఏమిటిలాభం ? 'స్వరాజ్యంకావాలి, అహింసాకావాలి.' ఇదెలావుంది ? అవ్వాకావాలి, బువ్వాకావాలన్నట్టుంది, ఇక స్వరాజ్యాన్ని ఎలాసాధించడం?

ఈవిధంగా ఆదర్శానికన్నా, అంత్యానికన్నా, దాన్ని సాధించే మార్గానికి అతిప్రాముఖ్యతను, గాంధీనాయకత్వంక్రింద, కాంగ్రెస్ ఇచ్చింది. అదేదానికి మొదటినుంచీ వచ్చిన బలహీనత.

ఇట్టిబలహీనతకు తోడుగా యుద్ధంవచ్చినతరువాత, ఇంకొకటి దానికి సంప్రాప్తించింది. మనం, మనజాతి స్వాతంత్ర్యాన్ని కోరుతున్నామంటే, దానికి వ్యతిరేకమైన, విరుద్ధమైన శక్తులు ఎక్కడున్నా, ఎలాంటిరూపంలో వున్నా, వాటితో గూడ పోరాడేందుకే. ఫాసిజం, సామ్రాజ్యవాదం రెండూ ప్రజాస్వాతంత్ర్యానికి ఆగర్భశత్రువులు. అందులో ఫాసిజం ఘోరమైన శత్రువు. దాన్ని ప్రతిఘటించాలని కాంగ్రెస్ గత 7, 8 సంవత్సరాలుగా ఉద్ఘోషించింది. అట్టి కాంగ్రెస్, తీరా, దాని ఆదర్శానికి విరుద్ధంగా, బ్రిటన్ ఎలాగో ఒకలాగు జర్మన్ ఫాసిస్టులతో పోరాడవచ్చేసరికి, బ్రిటన్ అధికారాన్ని ఇవ్వలేదన్న వంకతో, ఫాసిస్టులతో పోరాడ నిరాకరించింది. నిరాకరించడంతో పోనీక, దానికనుకూలమైన ఉద్యమాన్ని దేశంలో అన్నిమూలలా తలపెట్టింది. ఇది దాని స్వాతంత్ర్యం ఆదర్శానికి భిన్నం. ఇలా ఒకప్పుడు స్వాతంత్ర్య ఆదర్శానికన్నా, సాధనమార్గాలకు ప్రాముఖ్యతనిచ్చి, ఇప్పుడు ఆదర్శానికి విరుద్ధంగా ప్రవర్తించరావడంతోను, కాంగ్రెస్ ప్రజాసంస్థలక్షణాన్ని, ఆయ్యే అవకాశాన్ని, కోల్పోయింది.

దానికి తగ్గట్టుగా, ప్రజాస్వాతంత్ర్యవాదులు, వారి ఆదర్శానుగుణంగా

ప్రవర్తించేవారు గనుక, కాంగ్రెస్ అనుకూల వైఖరిమాని, వ్యతిరేక వైఖరి పుచ్చుకున్నారు. ఆచరణలో వారి ప్రజాస్వాతంత్ర్యాదర్శంతో, (1) కాంగ్రెస్ 'స్వరాజ్య' ఆదర్శం భిన్నమవడం, (2) తద్విరుద్ధమైన కార్యక్రమాలను ఉభయులు అనుసరించరావడం జరిగాయి.

మధ్యలో కమ్యూనిస్టులు గాంధీఆదర్శమైన కాంగ్రెస్ ఆదర్శంతో భేదించినప్పటికీ, ఐక్యత పేరుతో గాంధీతో చేతులు కలుపుతూవచ్చారు. దానికి త్రిపురీఘట్టమే నిదర్శనం. ఈనాడు ఫాసిస్టువ్యతిరేక యుద్ధమైన, ఈ అంతర్యుద్ధంలో, కాంగ్రెస్ వైఖరి, వారివైఖరి రెండూ విరుద్ధమైనా, కాంగ్రెస్‌తోను, గాంధీతోను ముడిపెట్టుకు కూర్చోవాలని ప్రచారంచేయ వస్తారు. వారికి తాముచేబట్టిన ఆదర్శంకన్నా, పద్ధతే ముఖ్యమైనదిగా తోస్తు న్నట్లు కనబడుతూవుంది. కాంగ్రెస్‌లోచేరి పనిచేయటం, ఆదర్శంకాదని, ఆ ఆదర్శాన్ని నెరవేర్చుకోవటాని కదొకమార్గమని వారు గ్రహించటంలేదు. ఈ యుద్ధంలో ఆ పద్ధతి తాము చేబట్టిన ఆదర్శానికి భిన్నమైందని, కనుక పద్ధతి మార్చుకోవాలన్న యోచన వారికి తట్టినట్లులేదు. వారి ఆదర్శానికన్నా పద్ధతి కెక్కుడు ప్రాధాన్యత ఇస్తున్నారు. అందుకనే దేశంలో వారి గందర గోళం, గజిబిజి, వారి కార్యక్రమం, మారని పరిస్థితుల్లోగూడా, ఒకటిగా ఎప్పుడు ఉండక పోవడం, చీటికి మాటికి మారకం జరగడం ! ప్రజలు గందరగోళం బడటం !!

అందువల్ల ముందు ఆదర్శం ముఖ్యమని, అందులో ప్రజాదర్శం అత్యంత ప్రధానమని, దానితరువాతనే, తదనుగుణమైన కార్యక్రమాదులకు ప్రాధాన్యత ఇవ్వడం మేలని, తెలుసుకొని ప్రజానీకం, ఈవిధాన, ఈపద్ధ తిలో, ఏసంస్థ ఏపార్టీ నడుస్తుందో జాగ్రత్తగ పరిశీలించినమీదట, ఆ పార్టీ లను, సంస్థలను ఆదరించాల్సివుంటుంది.

# ప్రజా స్వాతంత్రం

ఏబది సంవత్సరాల పైనుంచీ, భారతీయులు స్వాతంత్ర్య పోరాటాన్ని కొనసాగిస్తున్నారు. ప్రారంభదశలో దాన్ని స్వాతంత్ర్య పోరాటంగా పిలిచేందుకే వీలులేకపోయింది. అప్పుడు తెలుపబడిన వాంఛలు, పై, మధ్య వర్గానికి చెందినవే. పోరాటం సహితం ఆవర్గంలోని కొద్దిమందినే అంటి పెట్టుకొని వుంది. కాలం గడచినకొంద్దీ, పోరాటహద్దులు అతిక్రమించి పోయినై. తండోపతండాలుగా ప్రజానీకం అందులో పాల్గొంది. అలా పోరాటం ప్రజల నాకర్షించింది; ప్రజలు ఆపోరాటంలో పాల్గొనేందుకు ప్రారంభించారు. కాని ఇంతమాత్రంచేత అది ప్రజాస్వాతంత్ర్య పోరాటం కానవసరం లేదు.

ఒకవర్గం, స్వంతబలంతోటి, తనంతటతాను, తనకు కావాల్సిన వాంఛను నెరవేర్చుకోలేకపోతే, పరుల సహకారంతో దాన్ని పొందజూ స్తుంది. అందుకుగాను సమాజంలోని తతిమ్మా వర్గాలను, ప్రజాసమూ హాన్ని కూడగట్టుకుంటుంది. చరిత్రలో ఇది మామూలు. ఎవరి సహకారం మీద ఏపోరాట ఫలితమైనా ఆధారపడి ఉంటుందో, అట్టి ఇతర తరగతు లను, ముఖ్యంగా ప్రజానీకాన్ని సమాయత్తపరచాలంటే ఆ తరగతి వాటిని ఆకర్షించగల నినాదాలను, వాంఛలను వాటిముం దుంచాల్సి వుంటుంది.

ఒకప్రక్క ఆ నినాద వాంఛలను, వాటిముందు పెట్టేటప్పుడు, వాటి వల్ల 'ఆ, యా' తరగతులను ప్రజలను ఆకర్షించగలిగేటట్లూ, మరల ఇంకో ప్రక్క వాటికి ఒక నిర్ణీతమైన ఆకారాన్ని ఇవ్వకుండా, వాటి కది కట్టుబడక వుండా, వాటిని అస్పష్టంగా వుంచడంలో, మెలకువతో ప్రవర్తిస్తుం దావర్గం. భారతీయ ప్రజానీకానికి తమ, స్వాతంత్ర్య పోరాటంలో సరిగ్గా ఇదే సంభ వించింది. ఇండియా పైతరగతులకు, బ్రిటిష్ సామ్రాజ్యమునుండి, తమ వర్గం హక్కులను సంపాదించేందుకు, ప్రజానీకపు తోడ్పాటు అవసరమైంది.

కనుక, జాతీయ స్వాతంత్ర్యవాంఛ ప్రజలముందు పెట్టబడింది. ఆవాంఛతో తమ వర్గపోరాటాన్ని, పైవర్గాలు ప్రజల అండను సంపాదించుకోగలిగాయి. కాని, అదే పోరాటాన్ని దేశీయ, విదేశీయ దోపిడీవర్గాలకు వ్యతిరేకంగా జరిగే నిజమైన ప్రజాపోరాటంగా అభివృద్ధిచెందకుండా అటకాయించేందుకు స్వాతంత్ర్య ఆదర్శాన్ని సాధ్యమైనంతవరకు, చాలా అస్పష్టంగా వుంచడంతో జాగ్రత్తపడ్డారు.

స్వాతంత్ర్య ఆదర్శంలోని, రాజకీయ, సాంఘిక సమస్యల అస్పష్టత, ఆ అస్పష్టతను తొలగించడంలో చూపిన నిర్దాక్షిణ్యమైన వారి నిరాకరణ, ప్రస్తుత స్వాతంత్ర్యపోరాట హీనాభివృద్ధికి బాధ్యత వహిస్తాయి. ఒక నికరమైన ఆదర్శాన్ని, దాన్ని పొందటంవల్ల, ప్రజల దైనందిన జీవితంలో వచ్చే సుగుణాల్ని, ప్రజాబాహుళ్యానికి చూపెట్టకపోతే తప్ప, వారు కోట్లాల్లుగా కార్యరంగంలోకి దూకబోరు. అందులోను ముఖ్యంగా అంత్యనిర్ణయాన్నిచ్చే కార్యరంగంలోకి మొదలురారు. అస్పష్టమైన వాంఛలు, శుష్కనినాదాలు, అప్పటి కప్పుడు ఆవేశాన్ని మాత్రం ఇచ్చి తాత్కాలికంగా ప్రజలను సమావేశ పరచ గలగొచ్చు. అయినప్పటికీ, మంచి కట్టుదిట్టాలతో గూడిన ప్రజాబలంతో, ఎక్కువ కట్టుదిట్టాలతో గూడిన బలిష్ఠమైన శత్రువును ఢీకొనాల్సిన, బహుకాల పోరాటంలో, అవి కించిత్ పనిచేయనేరవు. జాతీయ బూర్జువా నాయకత్వం క్రింద నడచిన స్వాతంత్ర్య పోరాటంలో తమ తోడ్పాటును ఇవ్వడంలో, ఎప్పుడూ 'పాముచావదూ, బడితా విరుగని' విధానాన్ని, ప్రజానీకం చూపుతూ వచ్చింది. వారు చాలసార్లు, వేలకువేల సంఖ్యలో స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నారు. పాల్గొనటమే కాకుండా అంతులేని సాహసాన్ని ప్రదర్శించారు. కాని పోరాటంలో ఉత్సాహాన్ని కనబరచి, ఒక నికరమైన పంథాలో, ఒక్కొక్క అడుగుకు, దాన్ని బలపరుస్తూ, వారెవ్వుడూ రాజాలకపోయారు. ఆతప్పు వారిది కాదు. వారికి విశదమైన, నిర్దిష్టమైన ఆదర్శాన్ని ఇచ్చి, దానికోసం వారిలో ప్రోత్సా

హాన్ని, ఆసక్తిని కలిగించ నిరాకరించినటువంటి నాయకమ్మన్యులదే ఆ పొరపాటు. అట్టి ఆదర్శమే వార్ని విశాలమైన, దినదినాభి వృద్ధికరమగు, పోరాటాన్కి సన్నద్ధం చేయగలుగుతుంది. జాతీయ పోరాటంలోని ఈ భరింపరాని బలహీనతను ఈ దేశంలోని రాడికల్ ఉద్యమ పితామహులైన ఏకొద్దిమందో గుర్తించారు. జాతీయ ఉద్యమ, సాంఘిక రాజకీయ లక్ష్యాలను కాచి వడపోసిన ఫలితంగా, ఆ బలహీనతను పెటికి వేయాలని వారు యత్నించారు. వారి ప్రయత్నాలు, పై వర్గాల ప్రతినిధులచేత నిర్దాక్షిణ్యంగా అణిచివేయబడ్డాయి. కారణం ఆ ప్రయత్నాలు కొనసాగితే, జాతీయపోరాటం తన సరిహద్దుల నతిక్రమించి, సాంఘిక పోరాటంలోకి దిగే సూచనలను వాటిలోవారు పసికట్టారు.

జాతీయ ఉద్యమం ప్రపంచ, సాంఘిక, రాజకీయ ఆదర్శాలను విపులపరచి వుంటే, ఫాసిస్టు వ్యతిరేకయుద్ధంలో, దాని వైఖరివిషయంలో అనుమానించాల్సిన పని ఉండేది కాదు. ఈ ఉద్యమమంతా దానికి కట్టుబడి వుండేటట్టుగా, దాని ఆదర్శాన్ని నిర్వచించగలిగే ముందే యుద్ధం ఇండియామీదకు వచ్చి పడింది. దానిఫలితంగా ఉద్యమం, రెండు వైఖరీలకు మధ్య ఎటు మొగ్గుదామా అని, చాలకాలం తటపటాయించింది. కడకు స్వాతంత్ర్య ప్రజాస్వామికాలకు వ్యతిరేక శక్తుల శిబిరంలో చేరటానికి నిర్ణయించింది. యుద్ధానికి ముందుకాలంలో, సాంఘిక, రాజకీయ లక్ష్యంలోని అస్పష్టత, జాతీయ పోరాటాన్ని విశాలంగాను; ప్రజాపోరాటంగాను మార్చేందుకు అడ్డువచ్చిందన్న దృష్టిలో, పరోక్షహానిగామాత్రమే పనిజేసింది. యుద్ధంలో, ఈ సమయంలో ప్రత్యక్షహానిని, కలిగిస్తూవుంది. కారణం, జాతీయ ఉద్యమాన్ని ఫాసిస్టు దుష్టశక్తులతో బంతులు తీర్పించేందుకు ఆ అస్పష్టతనే, దాని నాయకులు వాడుకొంటున్నారు.

ఏనాడూ నిర్వచింపబడని స్వాతంత్ర్యం, ఈనాడు బ్రిటన్ పరిపాలన అంతం కావడంగా నిర్వచించబడుతూ వుంది. బ్రిటన్ పాలన ఎలాపోయినా

సరే, దానికి బదలకా ఏ వ్యవస్థ వచ్చిపడినా సరే, అది స్వాతంత్ర్యంగా ఎంచబడుతూ వుంది. ఒకతూరి ఈ నిర్వాచనాన్ని ఆమోదిస్తే ఇంకో మార్గం లేదు. జాతీయోద్యమం 'ఫాసిస్టు ఉద్యమాలతో' అంటిపెట్టుకోవాల్సివస్తుంది. కారణం, 'అక్షరాజ్యాల విజయం' భారతదేశంనుండి, బ్రిటన్ పాలన వైదొలగి పోవడమన్నదాన్ని ఎవడు కాదనగలడు? ఫాసిస్టుసిద్ధాంతంలో, దాని ఆచరణలో, ఎన్నడూ వారు తప్పుబట్టని కారణంచేత, స్వాతంత్ర్య ఉద్దేశం, భావం, ఇదివరలో ఎప్పుడూ నిర్వచించబడక పోవడంచేత, విప్లవ ప్రత్యాఘాతక జాతీయనాయకులు ఈవిధంగా, తేలిగ్గా దాన్ని నిర్వచించ గలరు.

ఏది ఎలా అయినా భారతపీడిత ప్రజానీకం, ఉవ్విళ్ళూరవచ్చేది, కావాలని కోరేది, ఈ స్వాతంత్ర్యాన్నేనా? బ్రిటన్ వైదొలగినంతమాత్రాన, ప్రజలకు, కావాలసిన రాజకీయ హక్కులు, ఆర్థిక సంపత్తి, సంస్కారణాభివృద్ధి, గ్యారంటీగా ప్రాప్తించవస్తాయా? తెల్లదొరలస్థానే, నల్లదొరలను ప్రవేశపెట్టినంతమాత్రాన, వారిని రాజకీయ కార్యకలాపాల్లో, ఉత్సాహవంతులుగా నిమగ్నులను చేయగలమా? స్వాతంత్ర్యం అంటే బ్రిటన్ పోవడమేగా చూడవస్తే, దోపిడిచేసేవర్గాలు, ఉత్పత్తిచేస్తూ పీల్చి పిప్పిచేయబడే ప్రజానీకంపై, పెత్తనం చెలాయించడానికికోరే స్వేచ్ఛ అని, నిర్వచించాల్సి ఉంటుంది. బ్రిటన్ పాలనపోవచ్చు, కాని సాంఘికవ్యవస్థ ఇలాగే వుండిపోతుంది. క్షీణించే పెట్టుబడిదారి విధానపు, ఈ యుగంలో, ఇలా వుండక పోగా, ఇంకా హీనస్థితి సంభవిస్తుంది.

ఎవరైతే ఈ నిర్వచనాన్ని అంగీకరించవస్తారో, ఉన్న వ్యవస్థను నిలబెట్టటానికి తాపత్రయపడతారో, వారు స్వాతంత్ర్యం పేరిట, ప్రజల రక్తాన్ని పీల్చివేసేందుకు, ఇంకా ఎక్కువ స్వేచ్ఛ, అధికారాల కోసం ప్రాకులాడేవారే. అది ఉద్దేశంకాని పక్షంలో బ్రిటన్ పాలన అంతమయిన తరువాత తేనున్న పాలనా స్వరూపాన్ని చూప నిరాకరించారు. దాన్ని ఏళ్ళక్తితెచ్చినా, ఎలావచ్చినా ఒకటే అంటానికి వీల్లేదు.

# ప్రజా స్వాతంత్ర్యం

స్వాతంత్ర్య ఆదర్శం ఈతప్పుడు నిర్వచనంతో, స్వాతంత్ర్యయోధులు పెడత్రోవలు త్రొక్కించబడుతున్నారు. పోనీ, ఈ పెడత్రోవలు త్రొక్కించటం, ఏవో కొన్ని తప్పటడుగులువరకు అయితే సహించగలం. పైపెచ్చు, నేరుగా, అందుకు విరుద్ధమైన పంథా త్రొక్కించబడుతున్నారు. విపులమైన స్వాతంత్ర్యాకారం, ప్రజల కెన్నడూ చూపబడలేదు. కాని, అస్పష్టంగాను, తెలియకుండాను, ఆర్థికసంపత్తికి, రాజకీయ సమానత్వానికి, ప్రజాదోపిడి విధాన నిర్మూలనానికి, వారు పోరాడుతున్నారు. ప్రజాదోపిడే అధికంగా ఉన్నట్టి, అత్యధిక అసమానత్వంతో కూడుకున్నట్టి, సాంఘిక వ్యవస్థను స్వాతంత్ర్యకాములు తప్పకుండా తిరస్కరిస్తారు. అటువంటిదానికోసం పోరాడ నిరాకరిస్తారు. కాని, ఈ తప్పుడు నిర్వచనంతో, ఈనాడు సరిగ్గా వారు న్యాయంగా దేన్ని తిరస్కరించాలో, దానికోసమే ప్రజానీకం పోరాడక తప్పిందికాదు. స్వాతంత్ర్య ఆదర్శంవల్ల ప్రోత్సహించ బడినవారై, రేకెత్తించబడినవారై, ఈనాడు వారు శాశ్వతమైన బానిసత్వానికి, యజమానులు మార్చేందుకు మాత్రం, ఇంకా అధికమైన బానిసత్వానికి, ఇంకా నికృష్టహీనస్థితికై పోరాడుతున్నారు.

కోరుకున్న ఆదర్శానికి విరుద్ధంగా, ఇలా చేయరావటంకన్నా హీనస్థితి ఇంకొకటి ఉండబోదు. ఏ స్వాతంత్ర్యంకోసమైతే పోరాటం కొనసాగించబడుతూవుందో, ఆస్వాతంత్ర్య రాజకీయ, సాంఘిక సమస్యల విషయమై, నికరమైన భావం, లేనందువల్ల ఇటువంటి మోసం జరుగుతూవుంది. మిలిటరీ పరిస్థితి మార్పు శుభమాఅంటూ, యుద్ధఫలితాన్ని ఇదేమంత మార్పుచేయజాలదు. ఇండియాజాతీయత, అంతర్జాతీయత ఫాసిజానికి విజయాన్ని తెచ్చిపెట్టే స్థితిలో ఇంకలేదు. కాని ఇంకా అది, దేశీయస్థితిని, తారుమారు చేయగలస్థితిలో, యూరప్‌లో ఫాసిజం, అక్షరాజ్యాలు, మిలిటరీ ఓటమితిన్నా, ఇండియాలో ఈ మోసం, ఫాసిస్టురాజ్యాంగాన్ని ఎర్పరచేందుకు, జాతీయతకు దోహదమిస్తుంది. ఈరోజున, సరిగ్గా, అందుకే అది ప్రయత్నిస్తూవుంది.

స్వాతంత్ర్యం అంటే బ్రిటిష్‌వారు పోవడంతోనే జమకట్టి వేలకువేలు నిజాయితీగల స్వాతంత్ర్య యోధులను మోసగజేసి, వారి బలాన్ని, ప్రాపకాన్ని, సంపాదించాలనే ఉచ్చుకు యెత్తుయెత్తి, తద్వారా ఫాసిస్టురాజ్యాంగాన్ని ఇండియాలో నెలకొల్పేందుకు, జాతీయనాయకులు చూస్తున్నారు. ఇటువంటి స్వరాజ్య ఆదర్శాన్ని, ప్రజలకు చూపుతూ, వారి ప్రత్యక్ష సహకారాన్ని కాకపోయినా, పరోక్ష సహకారాన్ని పొందుతూ, ఇండియాలో అట్టి రాజ్యాంగాన్ని నెలకొల్పాలని వారు తాపత్రయపడుతున్నారు. ఈ నాటకం, ఈ ద్రోహము, ప్రజాస్వాతంత్ర్యానికి విరుద్ధమని, ప్రజాస్వాతంత్ర్యం అంటే ఏమిటో, విపులంగా ప్రజానీకానికి, నిర్వచించి చూపరావటం శ్రేయస్కరం.

ఒక వర్గంగాని, ఒక తెగకాని కోరే స్వాతంత్ర్యంనుండి, ప్రజలాసక్తి చూపే స్వాతంత్ర్యంగాని, ఆధునిక మానవుడు పోరాడవచ్చే ప్రజాస్వాతంత్ర్యంగాని, భిన్నమైనవి. ఉన్న సంఘ వ్యవస్థలో, ప్రజాభావిభాగ్యోదయానికి, అవసరమైన సాంఘిక ఆర్థిక మార్పులను తీసుకురావాల్సి వుంటుంది. అందుకొరకే ప్రజలకు స్వాతంత్ర్యం కావాలి. రాజకీయాధికారాన్ని ప్రజల గుప్పెట్లో పెడితే తప్ప, అట్టిసాంఘిక, ఆర్థిక మార్పులను తీసుకురావటానికి వీల్లేదు. అందువల్ల బ్రిటిషు పరిపాలన పోవడం ముఖ్యం. కాని దానిస్థానే జాతీయ పెట్టుబడి విధానంతోగూడిన ప్రభుత్వం కాకుండా, ప్రజాస్వామిక ప్రజాప్రభుత్వం రావడం అత్యంత ప్రధానమైంది. ప్రజాప్రభుత్వం మాత్రమే రైతులకు భూమిని, పనిపాట్లవారికి దినదినాభివృద్ధికరమైన జీవిత వ్యయ ప్రమాణాన్ని, సామాన్య ప్రజానీకానికి అభివృద్ధిని, ఐశ్వర్యాన్ని, గ్యారంటీగా ఇవ్వగలుగుతుంది. దేశీయ సాంఘిక, ఆర్థిక, రాజకీయ శాఖ లన్నిటిలోను అభివృద్ధిని తీసుకురావాలంటే అనేక చట్టాలను, శాసనాలను, అమలులోకి తీసుకురావాల్సి ఉంటుంది. రాజకీయ ప్రజాస్వామికము, ఆర్థికసమానత్వము ఒకదాన్ననుసరించి ఒకటి నడుపవలసివుంది. అప్పుడే, మూడేళ్ళకు, ఐదేళ్ళకు,

# ప్రజా స్వాతంత్ర్యం

కేవలం వోటు చేసే హక్కు మాత్రం కాకుండా దేశీయ రోజువారీ పరిపాలనను ప్రజలు, తమ యజమాయిషీ క్రింద నడుపుకోగలుగుతారు. సాధారణ మానవుడు, రాజకీయ సిద్ధాంతాల ననుసరించే కాకుండా, ఆచరణలలో కూడా దేశీయపరిపాలకుడుగా ఉండగలగాలి. జీవిత ఆర్థిక అవసరాలనుండి స్వేచ్ఛ, మానవునకు, శాస్త్రం, కళ, సంస్కారణలను అభ్యసించటానికి దోహదమిస్తుంది. అలా ఉన్నతే మానవనాగరికత, సంస్కారణలకు పునాదు లేర్పడతాయి. ఏ స్వాతంత్ర్యం కోసమయితే మానవుడు పోరాడుతున్నాడో, ఆస్వాతంత్రంతో భారతీయపీడిత ప్రజానీకానికి, రాజకీయ హక్కులను, ఆర్థిక అవకాశాలను, సంస్కారణావకాశాలను, గ్యారంటీ చేయాలి. ప్రజాస్వాతంత్ర్యంలోని సాంఘిక, రాజకీయ భావం అది.

ఇట్టి స్వాతంత్ర్యాదర్శాన్ని చేపట్టి, తదనుగుణంగా ఏ యే పార్టీలు, సంస్థలు పోరాడవస్తాయో అవి ప్రజాపార్టీలు. ప్రజాసంస్థలు కానివి ప్రజాద్రోహ విధ్వంసకపార్టీలు. కనుక ప్రజానీకం తమ తమ నిజమైనపార్టీ లేవో, యెన్నుకోవటంలో కడు జాగరూకత వహించాలి. కానిపక్షంలో, ఈ నాడు భారతీయ స్వాతంత్ర్యం పేరిట జరుగుతున్న జాతీయ ఫాసిస్టు అరాజక ఉద్యమానికి గురి కావల్సి వస్తుంది. తత్ఫలితంగా దేశీయ ఫాసిజాన్ని కొని తెచ్చుకొన్న దౌతుంది.

# పేదల బాట

"స్వరాజ్యం" అంటే బ్రిటన్ పోవడమేనని, స్వరాజ్య పోరాటం అంటే బ్రిటిష్ వారితో పోట్లాడటమేనని, ఇండియాలో జరిగిందే ఇండియా స్వాతంత్ర్య పోరాటమన్న సంకుచితభావాలు దేశంలో నాటుకుపోయాయి. ఇండియా ప్రపంచములో ఒకభాగంగనుక, ఇండియా స్వాతంత్ర్య పోరాటం ప్రపంచ స్వాతంత్ర్య పోరాటంలో ఒకభాగమని జాతీయవాదులు గుర్తించ రావడంలేదు. "మాదేశం మాదికాబట్టి స్వరాజ్యం కావాలని"వారివాదన. తెల్లవారినుంచి, నల్లవారి కధికారంర వస్తేచాలు, దేశానికి ముక్తి వచ్చినట్లుగా వారు ఎంచుతున్నారు. "తన్నినా మనవాళ్ళేగా" అన్న సంతృప్తితో ప్రజానీకం తలపోస్తూవుంది.

కాని తాము ఏస్థితిలో వుండి, వున్నస్థితిని పోగొట్టుకొని అంతకన్నా మేలైనస్థితికి పోవాలనీ, ఆపోవటం ఎలాగన్న విచక్షతను స్వరాజ్యం అని పలవరించే దేశీయసోదరులు గుర్తించరావడంలేదు. ఈ అజ్ఞానమే, ఈరాజకీయ చైతన్య విహీనతే, నేడు దేశంలో ఫాసిస్టుల సానుభూతికి దారితీసింది. స్వరాజ్యశబ్దానికి నిండైన అర్థం తెలిసిన ఏవ్యక్తికిగాని, ఏజాతికిగాని, ప్రపంచ స్వాతంత్ర్యాన్ని వ్రేళ్ళతో పెకలించబోతున్న ఫాసిజం, అభిమానించ దగింటాతుందా? బ్రిటన్ స్వాతంత్ర్యాన్ని ఇవ్వలేదన్న నెపంతో అసలు స్వాతంత్ర్యానికే అగర్భశత్రువైన ఫాసిజానికి సానుభూతి జూపడమా?

మనం స్వరాజ్యాన్ని కోరుతున్నప్పుడు, మన పోరాటం దానికడ్డు వచ్చే వారందరిమీద. మనకు స్వాతంత్ర్యలక్ష్యమే ఆదర్శమైనపుడు మన మిత్రత్వం దాని కనుకూలించే వారందరితోను. మన పోరాటానికి ఎల్లలు లేవు. మన పోరాటం ఎల్లప్పుడూ ఒకేరీతిగా, ఒకేశక్తిమీద నడువదు. నడువకూడదు. ఈనాడు శత్రుత్వంవహించేశక్తి రేపు అనుకూలించవచ్చు. ఈనాడు మిత్రత్వంవహించేశక్తి రేపు శతృత్వంవహించవచ్చు. స్వాతంత్ర్య పోరాటం,

కాలానుగుణమైన మార్పులను బట్టి ఎలా మారుతుందో, దాని అనుకూల, ప్రతికూల శక్తులుగూడా అలాగే మారుతూ వుంటాయి.

ఇప్పుడు జరుగుతూవున్న ఫాసిస్టువ్యతిరేక యుద్ధం సరిగ్గా అలాంటి మార్పులనే తెచ్చిపెట్టింది. ఇండియా ప్రజానీకం ఈమార్పును గుర్తించాలి. గుర్తించడంతోబాటు దానికి తగట్టుగా నడుచుకోవాలి. ముఖ్యంగా కూలీ వర్గం, ఈమార్పును ముందుగా గ్రహించాలి. ఎందుచేతనంటే. ఏదేశంలోనైనా ఏ స్వాతంత్ర్య పోరాటంలోనైనా, వారేముందంజవేయాలి గనుక.

అసలు కూలీలుకోరేది వారి కాయకష్టానికి ప్రతిఫలం. అది సమాజంలో, పీడించేవర్గం, పీడింపబడేవర్గం ఉన్నంతవరకు కొనసాగదు. అనగా కూలీలపోరాటం పీడితవిధానంతో, దాని ప్రతినిధులతో, దాని మిత్రకోటితో. వారు తెల్లవారు కావచ్చు; నల్లవారు కావచ్చు. కూలీలకు దానితో నిమిత్తం లేదు. అందుకనే వారిపోరాటం దేశీయసరిహద్దులను దాటుతుంది. ప్రపంచములో ఏభాగంలో, వారితోబాటు పీడనవిధానంతో పోట్లాడే ప్రజానీకం వుందో, అంతవరకు వారి పోరాటం విస్తరిస్తుంది, వారిస్నేహం వ్యాపిస్తుంది.

ఇంతవరకు, యుద్ధానికిముందు, బ్రిటన్ అలాంటి పీడనవిధానాన్ని నిలబెట్టేందుకు యత్నించిన కారణంతో, దాని వ్యతిరేక పోరాటాన్ని కూలీలు సాగించారు. ఈనాడు అట్టి పీడన విధానాన్ని నిలబెట్టేందుకు విశ్వప్రయత్నాలు చేస్తున్న జర్మన్, జపాన్, ఇటలీ ప్రభుత్వాలతో, బ్రిటన్ తనవైఖరి మాని, ఢీకోవటంచేత కూలీలు వారి పోరాటంలో భాగస్వాములుగా బ్రిటన్‌తో నేడు చేతులు కలుపవలసివచ్చింది. అందుకు కూలీలు సంకోచపడరాదు. జంకరాదు. వెరగందరాదు. వారికి వారి ఆదర్శమే ప్రాణప్రదం.

కనుక ఎల్లప్పుడూ ఒకటేవిధానం, ఒకటేశత్రువు, ఒకడే మిత్రుడన్న భావం కూలీలు వొదులుకోవాలి. విధానమేదైన ఆదర్శానుగుణంగా ఉంటే చాలు. దాన్నే కూలీలు విచారించాల్సివుంది. విచారించి ఒక నిర్ణయానికి వచ్చిన తరువాత, ఫాసిస్టువ్యతిరేక పాత్రను తీసుకొని పనిజేయడమే ముఖ్యం

అయితే ఇప్పటి తమపాత్రను కూలీలు నిర్వహించటంలో కడుజాగరూకతతో మెలగాలి. విదేశదోపిడీదారులతోబాటు స్వదేశదోపిడీదార్లను వారు ఎదుర్కోవాల్సివుంటుంది. స్వదేశదోపిడిదార్లు జాతీయ నినాదాలనిచ్చి, జాతీయగీతాలను పాడి, మిత్రులుగా నటిస్తున్నారు. ఈ అపాయం ఇండియాలో మరీ అధికంగావుంది. దాన్నుంచి కూలీలు, తమ్ముతాము, రక్షించుకోవాలి. జాతీయసరిహద్దును అతిక్రమించాలి.

పీడించే వర్గాలన్నీ అంతర్జాతీయ దృక్పథంతో పనిసాగిస్తూ వున్నాయి. అటువంటి పరిస్థితుల్లో, కూలీలు— పీడింపబడేవారు— ఏ యే దేశాల్లో వున్నా, కలిసి తాముకూడా అంతర్జాతీయ దృక్పథంలో కృషిచెయ్యకపోతే, వారిశ్రమ వృథాఅయిపోతుంది. కనుక, ప్రపంచంలోవున్న కూలీలూ, కార్మికులు, బీదలు—అంతా చేతులు కలిపి, తమహక్కులకై పోరాడాలి.

# విప్లవమార్గం

అంతర్జాతీయ పరిస్థితులలోని వివిధ అవకాశాలను చర్చించిన తరువాత, యుద్ధానంతర ప్రపంచంలో దాదాపు రాబోయే ఆకారాన్ని మనం చూడ టానికి ప్రయత్నించవచ్చు. యుద్ధానంతర ప్రపంచంలో, ఇండియా ప్రజా స్వామికం, తగిన స్థానాన్ని పొందగలిగేటట్లు చూడటమే మన రాజకీయ యెత్తుగడయొక్క ముఖ్యోద్దేశం. నూతన ప్రపంచాన్ని నిర్మించేందుకు ఇండియా తన చేతనైనంతా చేయాలనీ, అలా చేయుటలో తన స్వాతంత్ర్యాన్ని, అభివృద్ధినీ, పొందగలగాలనీ మనం మొదటనుంచీ చెబుతూనేవున్నాం. కనుక యుద్ధానంతర ప్రపంచవ్యవస్థను, మేథావుల తర్కాభ్యాసాలతోగాని, కవి యొక్క ఊహాపోహాలతోగాని కాకుండా, ఆవ్యవస్థలో ఇండియా ఏస్థా నాన్ని సాధ్యమైనంతవరకు పొందగలదో, అట్టిదాన్ని పొందేందుకు, ఈలో పల ఆదేమేమిచేయాలో, ఆదృష్టిని మనం చూడవల్సివుంటుంది.

అక్షరాజ్యాల ఓటమి ఇప్పుడు దరిదాపులలోకి వచ్చిన అవకాశం కనబడుతూవుంది. అయినప్పటికీ మనం అలసతభావం చూపరాదు. ఇంకా చాల తీవ్రమైన పోరాటం చేయాల్సివుంది. మిత్రమండలి అంతిమవిజయానికి ఇండియా చేసే సహాయంలో ఏలోటుపాటు రాకుండా జరిగేటట్టు చివరివరకూ మనం చూడవల్సివుంది. అలా చూడటంలో మన ప్రయత్నాలను ఇంకా కొనసాగించవల్సివుంది. అక్షరాజ్యాల అంతిమ ఓటమి యదార్థమైందిగా ఇక జమకట్టగలిగినప్పటికీ, అంతమాత్రాన, ఫాసిజం నాశనమౌతుందా అనే అనుమానమేస్తుంది. కనుక మనకు సంబంధించినంతవరకు, అక్షరాజ్యాల్ల మిలిటరీ ఓటమితో, యుద్ధం అంతం అయినట్టుకాదు. యుద్ధానంతర ప్రపం చంలోకూడా మనం ఫాసిస్టువ్యతిరేక పోరాటాన్ని కొనసాగించాల్సి వుంటుంది. అప్పుడు మనం, ఇతరదేశాలలోని, ప్రజాస్వామిక, అభివృద్ధికర మగు శక్తుల సహాయాన్ని పొందజూస్తాం. వెనువెంటనే రానున్న భవిష్యత్తులో

మన విధానం, ఏదొక్కటే ఇండియా స్వాతంత్ర్యాన్ని, గ్యారంటీచేయగలదో, ఆ అంతర్జాతీయ కలయికను పొందాలనే ఉద్దేశాన్నిబట్టే. నిర్ణయించబడవల్సివుంది.

అక్షరాజ్యాల మిలిటరీ ఓటమితరువాత, యూరోప్ లో సాధ్యమైనంతవరకు ఏది జరుగబోతూవుందో దానిని, కొంత వివరాలతో చూద్దాం. బహుశా, చాలవరకు, యుద్ధానంతరం, వెంటనే, వివిధరకాలైన రాజకీయ, ఆర్థికవ్యవస్థలతో గూడిన రాజ్యాలు యూరోప్‌లో ఏర్పడవచ్చు. ఒకప్రక్క సోవియట్ యూనియన్, దానికి వ్యతిరేకంగా మరోప్రక్క ఇంకా సెమీ ఫాసిస్టురాజ్యాలు ఉండొచ్చు అన్నదాన్ని పూర్తిగా త్రోసివేసేందుకు వీలులేదు. మధ్యలో కొద్దో గొప్పో ప్రజాస్వామిక రాజ్యాలుంటాయి. ఈఆకారాన్ని చూసినవెంటనే చాలనిరుత్సాహం కలుగవచ్చు. కాని ఫాసిస్టు మిలిటరీయంత్రం నాశనం చేయబడటంతోబాటు, ఏఒక్కదేశంలోగూడా, ఫాసిజం, రాజ్యాంగాన్ని పూర్తిగా తన ఆధీనంలో ఉంచుకోలేనిస్థితికి తీసుకురాబడుతుంది. నిస్సంశయంగా అదొక పెద్దవిజయం.

విజయవంతమైన ఫాసిస్టు ఇనుపపాదాలక్రింద నలిగిపోతూవస్తున్న పురోభివృద్ధిశక్తులు విమోచనచేయబడతాయి. అలా అవి, తమ భావిరాజ్యాంగాలను, సృష్టించుకొనే శక్తినీ పొందగలుగుతాయి. సర్వాధికారాన్ని చలాయించటానికి యెత్తులు వేసే ప్రభుత్వాలచేత కొనిరాబడిన సెమీ-ఫాసిస్టు రాజ్యాలలోకూడా అణుమాత్రమైనా ప్రజాస్వామికం ఉండితీరుతుంది. ఏఊహాపోహాలలోను పడిపోక, మనం, సహేతుకంగా, యుద్ధానంతర యూరోప్‌లో అలాంటి ఆకారాన్ని ఊహించవచ్చు.

మిలిటరీ పోరాటం ఆసాంతానికి వచ్చిన వెంటనే, యూరోప్ దృశ్యాని కావల మనం చూడవస్తే, యుద్ధానంతర ప్రపంచంలో విశ్రాంతిలేని ఆకారాలు ప్రస్ఫుటమౌతాయి. యుద్ధానంతరం, మూడుశక్తుల ప్రవర్తన, వాటిమధ్యవున్న అంతర్గతసంబంధాలు, భావిప్రపంచ పునర్నిర్మా

ణాన్ని నిర్ణయిస్తాయి. ఫాసిజాన్ని కారణభూతమైన దాన్ని తీసివేయటంలో ప్రపంచ పునర్నిర్మాణంలో తీవ్రమార్పులు, తేవాలనే ఉత్సాహవంతులు, దాని ఫలితంగా ఇకముందు యుద్ధాలురాకుండా చూడాలని కోరేవారంతా, మిత్రమండలి యుద్ధానంతర విధానంమీద, సోవియట్ యూనియన్ తన పలుకుబడిని ఎంత ప్రసరించగలిగితే అంతమంచిదని సహజంగా భావించ వస్తారు. మిలిటరీ నాటకంలో, సోవియట్ ప్రభుత్వం దానిపాత్రను ఎంత వరకు నిర్వహింస్తుందో, ఆపరిశీలననుబట్టి చూస్తే దాని పలుకుబడి, శాంతి సభలోను, ఆతరువాతకూడా, ఎక్కువగానే చెల్లుబడి కావాల్సుంటుంది. కాని, ఫాసిస్టుయంత్రాన్ని భేదించటంలో అదిచేసిన మహాత్యాగమే, యుద్ధానంతర ప్రపంచాన్ని మార్చేవిషయంలో, దాని అంత నిర్ణయశక్తికి చాల వరకు అడ్డు తగులుతుంది. ఈనాడు, రెడ్ ఆర్మీని, శక్తివంతమైన ఎదురుదాడిని తీసుకొన్నందుకే కాక, సంవత్సరంన్నరనుండి నాజీదాడిని సాహసోపేతంగా ఎదుర్కొన్నందుకుకూడా, ప్రపంచం వేనోళ్ళ కొనియాడుతూ వుంది. అన్నిటికీ ముఖ్యమైన సోవియట్ రంగంలో నికరంగా దశతిరిగిఉండవచ్చు. ఈచలికాలంలో, నాజీయుద్ధయంత్రం, రష్యారంగంలో, ఎంతదెబ్బ తిన్నదంటే, రానున్న వేసవిలో తిరిగి ఎదురుదాడిని తీసుకోలేకపోవచ్చు. ప్రస్తుత సోవియట్ ఎదురుదాడి, రంగం అంతా పెద్దయెత్తున ఎదురుదాడిగా విజృంభించి, రష్యాసరిహద్దుల కావలవరకు నాజీలను గెంటివేయరావచ్చు కూడా. కాని, శత్రువు వెనక్కు పారిపోవటాన్ని అతని ఓటమిగా మనం పరిగణించకూడదు. ఇప్పటికికూడా, అతను రెడ్ఆర్మీ పునరాక్రమిస్తున్న ప్రతి మైలుకు తీవ్రంగా పోరాడుతున్నాడు. సహజంగా, శత్రువులు ఎంత వెనక్కు నెట్టివేయబడతారో అంత ఘోరంగా పోరాడవస్తారు. కనుక నాజీలను సరిహద్దులను, దాటకొట్టడం అంటే, రష్యాకు వస్తుసంపదలోను, మానవసంపదలోను చాల బరువుభారమైన విషయం. మొదటి సంవత్సరంన్నర, రష్యా నష్టపడ్డదాన్ని గుర్తుంచుకొంటే, ఈబరువుభారంలోని ప్రతి

డిగ్రీని మనం ఊహించ గలుగుతాం. ఈ అన్ని విషయాలనుబట్టి, నావుద్దేశం ఏమిటంటే, యుద్ధమైన వెంటనే జర్మనీలోకి రష్యావిప్లవాన్ని తీసుకు వెళ్ళగలిగే స్థితిలో ఉండజాలదు. మిలిటరీగా సావకాశం ఉన్నా, అలా చేయవచ్చేందుకు రష్యా ఇంకో కారణంవల్ల ఆప్రయత్నాన్ని మానుకోవచ్చు.

యుద్ధానంతర ప్రపంచంలో, యునైటెడ్ స్టేట్సు ఆఫ్ అమెరికా, రెండో ప్రధానశక్తిగా ఉంటుంది. రష్యాకి తోడు అది బలవత్తరమైనశక్తి అయ్యేటట్లు నిదర్శనాలు కనపడుతున్నాయి. రెడ్ ఆర్మీ, నాజీలను, తన దేశసరిహద్దులను దాటకొట్టి, జర్మనీలోకి అక్కడ విప్లవానికి దోహద మిచ్చేందుకు బహుశా యుద్ధాన్ని తీసుకువెళ్ళగలిగిన స్థితిలోవున్న సమయానికి, పశ్చిమ యూరోప్ లో అమెరికన్ లు సాధ్యమైనంతవరకు ఘట్టిగా కాలూది నిలువగలుగుతారు. యుద్ధానంతర యూరోప్ విషయమై వా రిది వరకే సూచన చేసివున్నారు. ఉత్తర ఆఫ్రికాలో వారు చేసుకొన్న కృత్రిమ ఒడంబడికలాంటిది, పశ్చిమయూరోప్‌లో, రానున్న సోవియట్ అపాయాన్ని ఎదుర్కొనే బ్లాక్‌ను సృష్టించగల శక్తిని వారికి ఇవ్వగలగవచ్చు. దూరదృష్టిలేని పురోగాములు గగ్గోలుచేసే యూరోప్‌లో రెండవరంగం, వెంటనే తెరువబడజాలనప్పటికికూడా, బెర్లిన్ మీదకు రెడ్ ఆర్మీ దండెత్తి వచ్చే అపాయంగానున్న సమయం, ఎక్కువైనకొందికీ, హిట్లర్ ఇదివరలో ఊహించినట్లు, ఉత్తర ఆఫ్రికా కేంద్రంనుండి అమెరికావారు, స్పెయిన్ గుండా, ఫ్రాన్సుగుండా రైన్ నదిమీదకువచ్చి వాలటానికి తేలికైనపని. అలా ఫాసిస్టులమీద విజయం, రష్యాకి చేయూతనిస్తే, నేరుగా ఈయుద్ధం అమెరికా రష్యాల మధ్యయుద్ధంగా దారితీయవచ్చు. అమెరికా ఇంకా బలమైన మిలిటరీశక్తిగానే వుంటుంది. అట్లాంటిక్ భద్రంగానే వుంటుంది. అమెరికా రష్యాలమధ్య సావకాశంవున్న యుద్ధంలోని శక్తిసంబంధాలు, రష్యాకు అననుకూలంగా ఉంటాయి. ఫ్రాన్సుపడిపోయినవెంటనే, ఇదివరలో, యూరోప్, రష్యా, అమెరికాలల్లో దేనినో ఒకదానిని ఎన్నుకోవాల్సి వుంటుందని

ప్రాశాను. ఆ ఎన్నుకోవటం, ఇంకా జరుగవల్సివుంది. కాని రష్యావారు సాధారణంగా ఆ సమస్యను నొక్కి అపాయాన్ని మాత్రం తీసుకురారు, వారు ఓర్పువహించేటట్టుగా సలహా ఇవ్వబడతారు. అన్ని ఉడిగినశక్తుల సంబంధాలవల్ల చరిత్ర వెనుక్కి నెట్టివేయబడజాలదని, వారు ఎరిగిఉండటం వల్ల. సంఘటనలను బలవంతంమీద జరిపించరారు. ఆవేశపరులై, ప్రవర్తించ వచ్చేబదులు, అక్షరాజ్యాలమిలిటరీ ఓటమిని ఆధారంచేసుకొని, పరిస్థితుల కనుగుణంగా, శాంతియుతంగా, విప్లవం ముందుకు సాగిపోవటాన్ని, వారు లెక్కకు తీసుకుంటారు.

యుద్ధానంతర యూరప్‌లో మూడోశక్తి బ్రిటన్. రష్యా-బ్రిటన్‌ల సంధి, యూరోప్‌ను ఫాసిజంనుండి విముక్తిచెందించటంతోబాటు, శాంతియుతంగా, సోషలిజంవైపుకు ప్రయాణంచేయించటాన్ని, గ్యారంటీచేయగలుగ వచ్చు. సోవియట్ నాయకులు ఈసంధికి, చాలప్రాముఖ్యత ఇచ్చినసంగతి తేటతెల్లమే. లేనిపక్షంలో 20 ఏండ్లవరకు ఇంగ్లండుతో సంధిచేసుకొని ఉండరు. నిజానికి, ఈయుద్ధం అంతవరకు, అన్నాళ్లు కొనసాగుతుందని వారు అంచనా వేసిఉండరు. వారు సావకాశమైన సంఘటనల్ను ముందే ఆలోచించి ఉంటారు. యుద్ధానంతర యూరోప్ విషయాలల్లో నిస్సహాయకరమైన అమెరికా జోక్యాన్నికూడా వారు ఊహించిఉంటారు. అమెరికా రష్యాలమధ్య బ్రిటన్ ఇంకా చరిత్రాత్మక నిర్ణయం చేయరాలేదు. కనుక రష్యా చాలాఓర్పువహించి, బ్రిటన్ ఆవల శిబిరంలోకి పోయే ఏచర్యనుగాని చేయకూడదు.

ఒకప్రక్క ఈయుద్ధం తరువాత, సోవియట్ యూనియన్ అలసిసొల్లసి పోతున్నప్పుడు, యునైటెడ్ స్టేట్సు ఆఫ్ అమెరికా శక్తివంతమైన మిలిటరీశక్తిగానూ, ఆర్థికశక్తిగాను బయటపడుతుంది. అన్నివిధాలా బ్రిటన్ బలహీనపరుచబడుతుంది. తూర్పువలసదేశాలనన్నిటినీ, ఇదివరకే అదిపోగొట్టుకుంది. వాటిని తిరిగి సంపాదించగలగటంగాని, కావాలని కోరగలగటంగాని,

తిరిగి వశంచేసుకోవటంగాని అనుమానాస్పదం. జపాన్ చివరకు ఓడించబడుతుంది. కాని దానిఫలితంగా ప్రధానమైన పసిఫిక్ శక్తిగా అమెరికా తయారవుతుంది. బ్రిటిష్ డొమినియన్లైన కెనడా, ఆస్ట్రేలియా మొదలైనవి యుద్ధానంతరం, మాతృదేశాన్ని విడనాడి, అమెరికాకు సన్నిహితంగా చేరవస్తాయి. ఆఫ్రికాభూమిమీద, అమెరికా అప్పుడే కాలుబెట్టింది. ఈయుద్ధం అయ్యేలోపుగానే బ్రిటన్ పుణ్యమాఅని, అది ఇంకా ఖండంలోకి చొరుచుకుపోవచ్చు. దాన్ననుసరించి ఇంగ్లండ్ బ్యాంకులు, ఆర్థికంగా యింకా, ఏవిధమైన ఆధిపత్యాన్ని కలిగివున్నాయో అవిమినహాగా, బ్రిటన్ ఒక చిన్న దీవి కంటిపెట్టుకున్న రాజ్యంగా చేయబడుతుంది. బ్రిటిష్‌ప్రజలు యిందులో విచారించాల్సిందేమీలేదు. వాస్తవానికి అది బ్రిటిష్ ప్రజాస్వామికానికొక విజయంకాబోతూవుంది. ఆ విజయం శుభమాఅంటూ, బ్రిటిష్ సామ్రాజ్యం, జాతి, భూగోళ, మత, హద్దుల నతిక్రమించి వివిధస్వతంత్ర ప్రజలతో గూడిన కామన్ వెల్తుగా మారవచ్చు. ఈయుద్ధం ఫలితంగా జరిగే ప్రత్యక్షమేల దొకటికావచ్చు.

అలాంటి స్థితిలో, సెమీ-ఫాసిస్టురాజ్యాంగాలను స్థాపించడంద్వారా అమెరికన్ సామ్రాజ్య సహాయంతో, ప్రస్తుతం కృశించిబోతున్న పెట్టుబడి విధానాన్ని, తిరిగి నిలవబెట్టేదానికన్నా, ఫాసిస్టు వినాశనంమీద యూరోప్‌లో నూతన రాజకీయ, ఆర్థికవ్యవస్థను బ్రిటన్ నిర్మించ దోహదమిస్తుంది. కనుక, ఆంగ్లో-సోవియట్ సంధి, యుద్ధానంతరం, యూరోప్ పునర్నిర్మాణానికి పునాదిరాయి అయ్యే సూచనలు కనుబడుతున్నాయి. యూరోప్ పునర్నిర్మాణము జరూరుగా ప్రపంచ పునర్నిర్మాణాన్ని ప్రతిబింబించ గలుగుతుంది.

యుద్ధానంతర ప్రపంచంలోని, ఆ నూతనశక్తుల ముఠాలో, ఇండియా ఏ స్థానాన్ని తీసుకోవల్సి వుంటుంది. అమెరికా సామ్రాజ్యం ఇండియా జాతీయతను, తన ఆదరాభిమానాలక్రిందకు ఒకప్రక్క తీసుకుంటుంటే,ఇతర

భారతీయులు యుద్ధానంతరం జరుగనున్న శాంతిసభలో, రష్యా ఇండియా స్వాతంత్ర్యం కోసం సవాలు చేయవస్తుందని విశ్వసిస్తున్నారు. యుద్ధమయిన వెంటనే, అది ఏమివస్తుందో తెలుసుకోవటానికి, రష్యా ఎలాంటి క్లిష్టస్థితిలో వుంది, మనం మనసులో వుంచుకోవాలి. అలాంటప్పుడు రష్యా అలాచేయవస్తుందని ఊహించటానికి వీలులేదు. ఉన్నపరిస్థితులలో అమెరికన్ సామ్రాజ్యం చెప్పుచేతులక్రిందకు, ఇండియా జాతీయవాదులు పోయేటటువంటి, ఇండియా స్వాతంత్ర్యం కోసం ఒత్తిడిచేసి, బ్రిటన్‌తో తనకున్న సహకారాన్ని, రష్యా సాధారణంగా చెడగొట్టుకోరాదు. యింకోప్రక్క, వివిధఇతర స్వతంత్ర ప్రజలతో గూడిన కామన్‌వెల్తుకి సోవియట్‌కూ మధ్య సంధి అది అయినట్లయితే, బ్రిటన్ రష్యాలమధ్య సంధి, నూతన ప్రపంచ సృష్టిని గ్యారంటీగా చేయగల మహత్తరశక్తి అవుతుంది.

జరుగబోయే శాంతి మహాసభలో మూడు ప్రభుత్వాలమధ్య పోరాటంగా అది తయారవుతుంది. ఆ చరిత్రాత్మక మహాసభాఫలితం, బ్రిటన్, అమెరికా, రష్యాలలో, దేనిని బలపరుస్తుందో, దేనిని కోరుకుంటుందో, దానినిబట్టి వుంటుంది. సోవియట్ నాయకులు, ప్రసిద్ధికెక్కిన వారి వాస్తవిక జ్ఞానంతో, బ్రిటన్, సరైన పక్షాన చేరవస్తుందని ఎంచుతున్నట్టు మనం అంచనా వేయగలం. ఇండియా స్వాతంత్ర్యానికి చాంపియన్లుగా అమెరికా వారు ప్రవర్తించవస్తారు. బ్రిటిష్‌వారు, వార్ని ఆవిషయంలో ప్రతిఘటించజాలరు. బ్రిటన్‌ను, అన్ని ప్రధాన సమస్యలలోను బలపరుస్తూ, ఇండియా విషయంలోమాత్రం, రష్యా పట్టీపట్టని ధోరణిచూపవస్తుంది. కనుక వెనువెంటనే, శక్తివంతమైన అమెరికా, అత్యధికంగా బలహీనమైన బ్రిటన్‌లమధ్య ఇండియా 'తగువులమారి' కాబోతూవుంది. ఆపై రెంటితో ఉండే సంబంధాన్నిబట్టి ఇండియా భవిష్యత్తు నిర్ణయించబడుతుంది.

అమెరికన్ సామ్రాజ్యం పలుకుబడిక్రిందకు ఇండియా పోవటాన్ని బ్రిటన్ ఆపరాజాలదు. బ్రిటన్‌తో, అలా విడిపోవటాన్ని ఇండియా జాతీయ

వాదులు ఆహ్వానిస్తారు. ఇంకా సామ్రాజ్య వ్యతిరేకులమని చాటుకుంటూ, సుఖంగా శక్తివంతమైన సామ్రాజ్యంతో (అమెరికన్), వారు కొద్దిపాటి భాగస్వాములు కాబోతూవున్నారు. ఇండియా ప్రజాస్వామికంవల్లే, ఇండియాలాంటి దురదృష్టం తొలగించబడగలదు. ఈ అపాయాన్నుండి, ఇండియాను రక్షించి, దానికి నిజమైన ప్రజాస్వాతంత్ర్యాన్ని గ్యారంటీ చేయాలంటే ఇండియా ప్రజాస్వామికము, జాతీవిద్వేషాలనుండి బయటబడి, దానిస్థానాన్ని అంతర్జాతీయ ఐకమత్యంలో చూచుకోవాల్సి వుంటుంది. యుద్ధానంతర ప్రపంచంలో, ఆంగ్లో-సోవియట్ సంధి, ప్రజాస్వామిక ఇరుసులాంటిదిగా పనిచేస్తుందని నమ్మవచ్చు.

చర్చ జరుగుతున్న సమయంలో, ఇండియా స్వయంనిర్ణయసూత్ర హక్కును ఆమోదించి, యుద్ధం తరువాత, బ్రిటిష్ ప్రజాస్వామికము ఇండియావిషయంలో ఎట్టి సంబంధం పెట్టుకొనక పోవచ్చునని సూచన చేయబడింది. బ్రిటిష్‌సామ్రాజ్యం ఇండియాను యింకా తన చేతుల్లో పెట్టుకొనేందుకు శక్తికలిగివుండదు. ఈరోంపినుండి, బ్రిటీషు ప్రజాస్వామికం తప్పుకొంటుంది. కనుక అధికారాన్ని అప్పజెప్పటం తప్పనిసరి. మనం తనంత బలాన్ని చేకూర్చుకోగలిగితే, మనం అధికారాన్ని చేబట్టగలం. మనం కోరుకుంటున్నట్లుగా, పరిస్థితిని మార్చలేకపోతే అధికారం, అప్పజెప్పరావటాన్ని మనం అటకాయించజాలము. కాబట్టి దాన్ని ఎందుకుగాను వ్యతిరేకించాలి ? ఈ వాదనలో కొంతబలముంది. కాని వాదన బలానికి మించినశక్తి దానికిలేదు. అంతతేలిగ్గా సంఘటనలు జరుగరావు. పరిస్థితి చాల గుంటచిక్కుడుగావుంది. యిండియాను దాని గోతికి దాన్ని వదలి సుఖవుగా యిండియాను విడిచి బ్రిటీషుప్రజాస్వామికం పోజాలదు. బ్రిటీషు ప్రభుత్వాన్ని, బ్రిటీషు ప్రజాస్వామికాన్ని, ఆషా మాషీగా మనం వేరుజేసి చూడరారాదు. ప్రస్తుత బ్రిటీషు ప్రభుత్వం, బ్రిటీషు ప్రజాస్వామికానికి, ప్రాతినిధ్యత వహిస్తూంది. బ్రిటీషుప్రజాస్వామిక యజమాయిషీక్రింద బ్రిటీషు

బ్రిటీషు ప్రభుత్వం నడుస్తూవుంది. బ్రిటీషు ప్రజాస్వామికం, బ్రిటీషు ప్రభుత్వమనే మధ్యయంత్రంద్వారా తప్ప వ్యవహరించజాలదు. యింకొకప్రక్క ప్రస్తుత యిండియా ప్రభుత్వాన్ని బ్రిటీషు ప్రభుత్వం ఆధీనంలో వుంచుకొని వుంది. కనుక నేటి యిండియా ప్రభుత్వానికి, బ్రిటీషు ప్రజాస్వామికానికి మధ్య ఒక సంబంధంవుంది.

మనం మారేయుగంలో వున్నాం. బ్రిటన్ అలాంటిమార్పును అనుభవిస్తూవుంది. బ్రిటన్, యిండియా, రెండుదేశాలలోగూడా, ప్రభుత్వం ఈ నాడు సామ్రాజ్య ప్రభుత్వమూకాదు, ప్రజాస్వామిక ప్రభుత్వమూకాదు. మార్పు క్రమంలోవున్న రాజ్యాంగం అది. ఒక తెగయొక్క రాజకీయ వ్యవస్థే రాజ్యాంగం. మొన్నటిదాకా, బ్రిటన్‌లో అదే రాజ్యాంగాన్ని మూడు రాజకీయపార్టీలు, వంతులు ప్రకారం పరిపాలించాయి. మెజారిటీ పార్టీ ప్రభుత్వాన్ని ఆధీనంలో వుంచుకొంది. ఆపరిస్థితి యింక యిప్పుడు లేదు. ప్రస్తుత బ్రిటీషుపార్లమెంట్‌లో కన్సర్వేటివ్-పార్టీకే మెజారిటీ వుంది. కాని మంత్రివర్గం వేరుగా కూర్చబడివుంది. మార్పుపులో నాటున్న రాజ్యాంగం అదే.

ఒక రాజ్యాంగాన్ని, యింకో రాజ్యాంగం తొలిగించవచ్చే మేరవరకు, బ్రిటన్‌లో, రాజకీయ విప్లవం కొనసాగుతూవుంది. పెద్దమార్పులలోనైన ఆర్థికపునాది నాధారం చేసుకొనే రాజకీయ విప్లవం జరుగుతుంది. చాలవరకు సొంత ఆస్తిని ప్రభుత్వం స్వాధీనం చేసుకోవటం వాస్తవమైంది. పెద్దపెద్ద ఆదాయాలన్నిటిలోనూ నూటికి తొంభయి వంతులను ప్రభుత్వం వశంచేసుకొనే రూపంలో అది జరుగుతూవుంది. యుద్ధకాల అవసరాన్ని బట్టి అది జరుగరావచ్చు. కాని అక్కడ జరుగుతున్నది మాత్రం వాస్తవం. రాజకీయ ప్రభుత్వాని కాధారమైన ఆర్థిక విధానం మారుతూవుంది. కనుక రాజకీయంగా ప్రభుత్వంకూడా మార్పుక్రమంలోవుంది.

బ్రిటిష్ సామ్రాజ్యం రాజకీయ వ్యవస్థతోబాటు ఆర్థికవ్యవస్థకూడాను!

అవ్యవస్థ కీలకంలోవచ్చినమార్పుక్రమం, దానిభాగంలో అంతటా ప్రాకి తీరుతుంది. అయితే, ఇతరత్రా ఏశక్తి అందుకడ్డుతగులకుండా ఉండాలి. బ్రిటన్‌లో శాంతియుతమైన విప్లవంజరుగుతుందని మనం అంగీకరిస్తే, రక్తపాతంతో వచ్చిన విప్లవమే విప్లవమన్నంత ఛాందసవిప్లవకారులం మనం కాకుండా ఉంటే అప్పుడు, ఈనాడు, బ్రిటిష్ సామ్రాజ్యం అని పిలువబడే, రాజకీయ ఆర్థికవ్యవస్థలో, క్రమేపి మార్పు రావటం చూచితీరుతాం. ఒక ఆదర్శంతో మనం నడుపబడుతూ, దానికోసం ఊహాతో కనీసం తాత్కాలికంగా గ్రుడ్డివారం కానంతకాలం, ఇంకాఏకారణంకోసం కాకపోయినా, కనీసం మనపని, అలా తేలిక అవుతుందన్న సాధారణ విచక్షణా జ్ఞానంతో ఆ కొత్త మార్పును మనం ఆహ్వానించితీరాలి.

కాని, ఈ ఆహ్వానక్రమంలోని అపాయం అటకాయించబడటం కాక కనీసం తాత్కాలికంగా బయటశక్తితో తీవ్రంగా జోక్యం కలిగించుకోబడటం ఆధారం లేనిదికాదు. ఆ భయంకరమైన బయటశక్తి ఇదివరలోనే పనిజేస్తూవుంది. బ్రిటీషు సామ్రాజ్యము తీరా, స్వతంత్ర ప్రజలతోగూడిన నిజమైన కామన్వెల్తుగా మారే క్రమంలో ఉండవచ్చేసరికి అమెరికా సామ్రాజ్యం, తన మూకీభావాన్ని వదలుకొని, శక్తివంతమైన సామ్రాజ్యశక్తిగా రంగంలో ప్రవేశించి, మనం కోరుకునే పురోభివృద్ధితో జోక్యం కలుగజేసుకొంటుంది.

స్వతంత్ర ప్రజలతో గూడిన కామన్వెల్తుగా, బ్రిటిష్ సామ్రాజ్యం మారుతుందన్న అవకాశాన్ని మనం ఊహిస్తున్నాం. దాని కాధారంగా కొంత చెప్పవలసివుంది. పెట్టుబడివిధానం ఎలా అయితే, తన పురోభివృద్ధికరమైన విధిని నెరవేర్చిందో, అలాగే, పెట్టుబడివిధానపు ఒక దశగా సామ్రాజ్యవాదంకూడా, తన పురోభివృద్ధికరమైన చరిత్రాత్మక ప్రాముఖ్యాన్ని ప్రదర్శించగలగవచ్చు. వివిధ దేశాలమధ్య ఏర్పరుచబడ్డ ఆర్థిక సంబంధ బాంధవ్యాలు అన్నిటికీ లాభదాయకంగా వుండే, ఉన్నతమైన ఆర్థిక

విధానానికి పునాదులు వేయగలవు. కనుక ఆ సంబంధాలను మాత్రం వూరకనే తెగ్గించివేసుకోవడంవల్ల, దానంతటది అభివృద్ధికరమైన ఆదర్శం కాజాలదు. ఇండియాలో సామ్రాజ్యవాదం విప్లవాన్ని తెచ్చింది. జాతిద్వేషంతో అంధులై, జాతీయవాదులు, చరిత్రసంఘటనలలోని, సాంఘిక విలువను అభినందించ శక్తిహీనులైరి. కాని కారల్ మార్క్సు, ఇండియాపై బ్రిటిష్ దండయాత్రను, వస్తుతా విప్లవచరిత్ర సంఘటనగా ప్రప్రథమంగా వ్యాఖ్యానించిన వ్యక్తులలో ప్రథముడు. తరువాత, చాలాకాలానికి, నేను గూడా, స్వతంత్రంగా అదే నిర్ణయానికి వచ్చాను. కనుక, బ్రిటన్ ఇండియాల మధ్య ఉన్న ఈ పెద్ద సంబంధానికి విప్లవప్రసరణ సోకి వుంటుందని అనుకోవటం సహేతుకమైంది. జాన్‌బుల్ అడుగు మడుగుల్లో ప్రవేశింపజూస్తున్న అమెరికన్ సామ్రాజ్య దయాదాక్షిణ్యాలతోగాక, ప్రజా సాంఘిక విమోచన, ఆర్థిక ఔన్నత్యాలను ఇవ్వగలిగే ఇండియాస్వాతంత్ర్యం ఆవిధంగా వస్తుందని నావుద్దేశం. ఇండియా బ్రిటిష్ సంబంధాలు, ఇండియా స్వాతంత్ర్యానికి యెలాదోహదమిస్తాయో యిప్పుడే చూపెడతాను. అలాచూపెట్టేముందు,జాతీయవాదంయిండియాస్వాతంత్ర్యాన్ని,అటకాయించేశక్తిగా పనిజేస్తుందన్న విషయాన్ని మాత్రం నొక్కిచెప్పక తప్పదు. బ్రిటన్‌లో జరుగుతున్న విప్లవమార్పులు, యిండియా పరిస్థితిని బాగుపరచే అవకాశం ఉన్నప్పుడు, విప్లవంనుంచి యిండియాను దూరంగా అట్టిపెట్టేందుకుగాను, యిండియా జాతీయవాదులు, రెండుదేశాలమధ్య సంబంధాన్ని తెగతెంపులు చేయాలని చూస్తున్నారు. సాంఘిక సంబంధాలతో మనం స్వారాజ్య శబ్దాన్ని నిర్వచిస్తున్నాం. కనుక నిజస్వాతంత్ర్యానికి ముందు విప్లవం జరగాలని మన అంచనా. కారణం, మనదృష్టిలో, విప్లవమంటే, చారిత్రాత్మకంగా అవసరమైన మార్పులుమినహాగా, యేమీ భయంకరమైనది కాదు. స్థితి అదైనప్పుడు మనదృష్టిలో, ఈ యుద్ధ తుఫానువల్ల రేగిన విప్లవతరంగాలను, యిండియాను దూరంగా అట్టిపెట్టాలని ఆదుర్దాపడే వారంతా,

యిండియా స్వాతంత్ర్య ఆదర్శవిషయంలో కుట్రపన్నుతున్నవారే. ఆకుట్ర అంతర్జాతీయమైన కుట్ర. ఆకుట్రకు వ్యతిరేకంగా మనం పోరాడితీరాలి. ఘట్టిగా, అమెరికన్ సామ్రాజ్యాన్ని మనం ఎదుర్కొనలేకపోవచ్చు. యుద్ధానంతర యూరోప్‌లో పరస్పర శక్తిసంబంధాలను మనం మార్చలేకపోవచ్చు. కాని, అమెరికన్ సామ్రాజ్య ఏజంట్లైన యిండియన్ మిత్రులతో మనం పోరాడగలం. అమెరికన్ సామ్రాజ్య ఆదరాభిమానాలను యిండియా జాతీయత పొందేందుకు ఆదుర్దా పడుతుందని, దానితో మనం పోట్లాడరావటం లేదు. యిండియాలో విప్లవం జరుగకుండా, అమెరికన్ సామ్రాజ్యంతో అది చేతులు కలుపబోతూ వుండబట్టే దానితో మనం పోట్లాడవచ్చేది.

ఇండియా పరిస్థితితోబాటు, అంతర్జాతీయ పరిస్థితిని, విడదీసి విపులంగా పరిశీలించినమీదట మారుతున్న బ్రిటన్‌తో దగ్గరసంబంధాన్ని, ఇండియా ఏర్పరచుకోవటంలో దాని స్వాతంత్ర్య ఆదర్శసాధనోపాయముందనీ, ఇంకో ప్రక్క, ఇండియా జాతీయవాదంద్వారా, జోక్యం పుచ్చుకోవడంతో, అమెరికన్ సామ్రాజ్యం జయించవచ్చునన్న నిర్ణయానికి వచ్చాం.

ఇపుడింకో ప్రశ్నకు పోదాం. బ్రిటీషుప్రజాస్వామికం, ఇండియాను గురించి ఎందుకు శ్రద్ధతీసుకుంటుంది ? ఈ ప్రశ్నకు సమాధానము యుద్ధానంతర పరిస్థితులనుబట్టి ఉంటుంది. సామ్రాజ్యం విచ్ఛిన్నం కావచ్చు. వలసలు పోవచ్చు. కాని, బ్రిటన్ యింకా ప్రపంచవర్క్‌షాపుగా మాత్రం ఉండిపోతుంది. ఒకసారి సామ్రాజ్యం తునాతునకలైతే, ప్రపంచవర్క్‌షాపు పునాది తిరిగి నిర్మించబడబోదు. బ్రిటీషు ప్రజాస్వామికానికి గూడా ఆ సాహసం చేయవచ్చే ప్రోద్బలంలేదు. బ్రిటన్ పెద్ద పారిశ్రామిక వ్యవస్థను కూలద్రోసి, వెనుకటి ఇంగ్లండ్ నాటికి దానిని తీసుకుపొమ్మని ఎవరూ సూచన చేయజాలరు. అటువంటివి యేవీ లేని కారణంచేత, గ్రామాదులకు బ్రిటీషు ప్రజలు పోజాలరు. వారు నగరాలలోనూ, టౌనులలోనూ, నివసిస్తూ, వారి

నవీన పరిశ్రమలను నడుపుకోవాల్సివుంటుంది. బయటనుంచి ముడివస్తువులనే కాకుండా, సంవత్సరంలో కావాల్సిన ఎక్కువ తిండి పదార్థాలను బయట నుండి వారు తెప్పించుకోవాల్సి వుంటుంది. దాని ఫలితంగా, బ్రిటన్‌లో సామ్రాజ్యవాదం నశించిపోయినా, బ్రిటన్ ప్రపంచవర్క్‌షాపుగా ఉండిపోవల్సిందే. దానికి కావల్సిన వస్తువులకు బదులు చెల్లించుకొనేందుకు పారిశ్రామిక వస్తువులను అది ఎగుమతి చేయక తప్పదు. ఇదివరలోనే, ఒకే ఆర్థిక విధానంక్రిందకు తీసుకురాబడిన దేశాలతోటి తన సంబంధాన్ని, అటువంటప్పుడు బ్రిటన్ ఇక ముందుకూడా ఎందుకు కొనసాగించగూడదు? ఇండియా రాజకీయ దాస్యం అదృశ్యమైనపుడు ఒక దాని మీద ఒకటి ఆధారపడవచ్చే ఆర్థికసంబంధాన్ని పోకుండా నిలబెట్టవచ్చాయన్నదే ప్రశ్న. ఇంకోమాటలో, ఉదాహరణకు, పరస్పర లాభంకోసం, బుద్ధిపూర్వకమైన తోడ్పాటును ఇస్తూ, ఒక నూతన సంబంధాన్ని యిండియా బ్రిటన్‌తో ఏర్పఱచుకొంటుందని ఊహించగలమా ?

ఇండియాలో ఏమిజరుగుతుందో దానిమీద ఆధారపడి ఉంటుందది. రెండువిధాల జరుగవచ్చు. (1) జాతీయతక్రింద చెల్లుబడిఅయ్యే పైతరగతులకు, అధికారాన్ని అప్పగించరావటంలో, అమెరికా ఒత్తిడిచేయవచ్చు; లేదా పైతరగతులు, వారిని ఆదరించే అమెరికన్ సామ్రాజ్యఆర్థిక పలుకుబడి క్రిందకు, బ్రిటన్‌తో తెగతెంపులు చేసుకొనిపోవచ్చు. (2) బ్రిటిషు ప్రభుత్వంద్వారా, తద్వారా ఇండియా ప్రభుత్వంగుండా, బ్రిటిషు ప్రజాస్వామికం, యిండియా ప్రజాస్వామిక శక్తులకే స్వయం నిర్ణయహక్కును చెలాయించగల అవకాశాన్ని యివ్వరావచ్చు. మొదటి దానివల్ల బ్రిటన్ యిండియా మార్కెట్‌ను కోల్పోతుంది. అలా వస్తువులను ఎగుమతి చేయలేదు, లాభం తీయలేదు. వాటి ననుసరించి, తినుబండారాలను, ముడి వస్తువులను యిండియానుంచి, బ్రిటన్ తెప్పించుకోజాలదు. బ్రిటిష్ పరిశ్రమలు, దాని యావత్ ఆర్థిక జీవితం తీవ్రంగా దెబ్బతింటుంది. బ్రిటీషు

ప్రజాస్వామికానికి, ఇది ఆహ్వానింపదగ్గ మార్పు కాదు. కనుక బ్రిటీషు ప్రజాస్వామికం ఇక ఇండియా భవిష్యత్తులో ఆశక్తి చూపరావడం సహజం కారణం, యిండియాలో, నిజమైన ప్రజాస్వామికప్రభుత్వం, పైతరగతులకు, ఏకొద్దిమందికో పనికివచ్చే, నిరంకుశ ఆర్థిక విధానాన్ని కోరరాదు. భారతీయ ప్రజా దారిద్ర్యాన్ని గురించి మాట్లాడటం, యిండియా జాతీయవాదులకు, ఫాషన్ అయిపోయింది. ప్రజాదారిద్ర్య సమస్యకు సరైన పరిష్కారాన్ని, జాతీయవాదులు ఇవ్వలేదు. మనం ఒక్కరమే దానిని యివ్వగలిగాం. సనాతన పెట్టుబడివిధాన హద్దులలో, యిండియా ఆర్థికసమస్యలు పరిష్కరించబడజాలవని మనం రుజువుచేశాం. కనుక సోషలిజంవంకకు దారితీస్తున్న బ్రిటన్‌తో స్నేహాన్ని మనం కావాలని కోరుకున్నాం.

—డిశంబరు, 42.

# ఇది ప్రజాయుద్ధం

బ్రిటన్ ప్రజాస్వామిక స్వాతంత్ర్యాలకోసం యుద్ధం చేస్తున్నా నంటూవుండే కాని, ఇండియాకు మాత్రం వాటిని వర్తింపజేయరావటంలేదు. కనుక ఇప్పుడు బ్రిటన్ చేస్తున్న యుద్ధంతో మన కేమి ప్రసక్తి అన్న ధోరణితో, సాధారణ జాతీయవాది వాదిస్తున్నాడు. అతను వాదించేముందు, ప్రజాస్వామిక స్వాతంత్ర్యాలనేవి ఒకరిస్తే వాటంతట అవి వచ్చేవి కావని, 'ఆయా' దేశప్రజలు తమ రక్తాన్ని వోడ్చి సంపాదించటంవల్లే అవి సాధ్య పడతా యన్న విషయాన్ని గుర్తించాలి. అందువల్ల బ్రిటనిస్తే మనం పుచ్చుకోవాలన్న ధోరణి పెట్టుకుకూర్చోవటంవల్ల ప్రయోజన మేమిటి? బ్రిటన్ ఇండియాపట్ల చూపే వైఖరిమీద నేటి యుద్ధతత్వం ఆధారపడి వుందా?

బ్రిటన్ మనకు యేదీ ఇవ్వలేదన్న సాకుతో ప్రస్తుత యుద్ధానికి మనం దూరంగా వుంటే దానివల్ల వచ్చే మంచి చెడుగులు మనకు తగలకుండా పోతాయా? అక్షరాజ్యాలు మనమీద దయదలచి యుద్ధాన్ని మన దేశం లోకి రాకుండా చూస్తాయా? లేదు. అలాంటి దెవరికైనా వున్నా, కాక అవివచ్చి మనకు స్వాతంత్ర్యాన్ని వరప్రసాదంగా ఇచ్చిపోతా యనుకొన్నా, గాలిలో మేడలు కట్టడం అవుతుంది.

అసలు మనకు కావలసిం దేమిటో, ఇలాంటిది యుద్ధసమయంలో మనం యెలా ప్రవర్తిస్తే, మన లక్ష్యానికి దగ్గరలోపడతామో, విచారించుకో వలసి వుంది. అందుకు నేటి యుద్ధం యెలాంటిది, ఇందులో యేపక్షం గెలిస్తే మనకు లాభం, యేపక్షంగెలిస్తే మనకునష్టం, అనేవి యోచించాలి.

ఫాసిజం అన్నా, సామ్రాజ్యవాద మన్నా మనం ద్వేషిస్తున్నాము. రెండూ నశించాలని కోరుతున్నాము. వాటి రెంటి క్రిందా నలిగిపొయ్యే ప్రజాసామాన్యానికి మన సానుభూతి, సహాయాదులు ఇస్తున్నాము.

అనగా, ప్రతి దేశం - మనదేశంకూడా - సంపూర్ణస్వాతంత్ర్యాన్ని అనుభవించాలని ఆశిస్తున్నాము. ఇంకోవిధంగా చెప్పాలంటే, ప్రపంచంలో ప్రతి మానవునకు తినేందుకు తిండి, కట్టుకునేందుకు గుడ్డ, వుండేందుకు ఇల్లు, చదువుకునేందుకు సకల సౌకర్యాదులు, విధిగా వుండాలని మన ఆదర్శం. అట్టి ఆదర్శానికి అడ్డువచ్చేవి యేవైతే వున్నాయో, వాటినన్నిటిని వీలైన విధంగా రూపుమాపేందుకు కంకణం కట్టాము.

యుద్ధం వచ్చేంతవరకూ మనం, ముఖ్యంగా భారతీయులం బ్రిటిష్ సామ్రాజ్య దోపిడికి గురౌతున్న కారణంచేత, దాంతో పోరాటంసాగిస్తూ వచ్చాం. ఇంతలో అంతర్జాతీయంగా బయలుదేరిన ఫాసిస్టుభూతం ప్రపంచ ప్రజలతోబాటు మనలను మ్రింగేందుకు సిద్ధంగా వుంది. యేమిచేయటం?

ఇదివరకు సామ్రాజ్యవాదాన్ని రూపుమాపటమే మనపని అనుకుంటే, ఫాసిజం "నేనున్నాను జాగ్రత్త" అని హుంకరిస్తూవుంది. వీటి రెంటినీ నాశనం చెయ్యాలి. ఇవి రెండూ మన ఆశయలక్షణాలకు ఆజన్మ విరోధులు. కాని సామ్రాజ్యవాదంలో కొంతలోకొంత స్వాతంత్ర్యం వుంది. పార్లమెంటువుంది. ప్రజాసంస్థ లుంటాయి. కార్మికసంస్థలుండేందుకు వీలుంది. ఫాసిస్టు దేశాలలో అలాంటివేవీ వుండే ఆస్కారం లేదు. ఒకడే నాయకుడు. వాడిమాటే చెల్లుబడి. యెదురు మాట్లాడితే వురికంబం. కనుక రెండూ పనికిరానివైనా, అందులో ఫాసిజంకన్నా సామ్రాజ్యవాదం కొంత మెరుగు. దీన్ని చరిత్ర చాటుతున్నది. విషయజ్ఞులు నిరూపిస్తున్నారు. మరి కాదనటం యేలా ?

బ్రిటన్‌లో ఒకటి నామకాపార్లమెంటైనా వున్నందువల్లే ప్రజలు (మనలాంటి ఆశయాలు కలవారు) దానిద్వారా ఫాసిస్టులతో యుద్ధానికి తలపడగలిగారు. ఈనాడు హిట్లరుతో యుద్ధంచేస్తున్నది బ్రిటిష్ సామ్రాజ్యవాదులుకారు; బ్రిటిష్ ప్రజానీకం. బ్రిటిష్ ప్రజానీకంతో మనకెప్పుడూ తగువులేదు. వారు మన స్వాతంత్ర్యపోరాటంలో భాగస్వాములు. లేకుంటే,

మొదటినుంచీ పెంచి పెద్దదాన్నిచేసిన ఫాసిజాన్ని తమచేతులతో తామ్, సామ్రాజ్యవాదులు, పోట్లాడటం యెలాసంభవించినది ? ఫాసిజాన్ని రూపు మాపటంవల్ల వారికివచ్చే ప్రయోజనమేమిటి ? ఫ్రెంచిసామ్రాజ్యవాదులేమి చేశారు ? ఫాసిస్టులకు స్వదేశాన్ని బలియిచ్చారు.

కాని, బ్రిటిష్ సామ్రాజ్యవాదులు యెందుకాపనిచేయలేదు ? చేయ లేకపోయారు. వారి వెనుక అనివార్యమైన ప్రజాశక్తి ఫాసిజాన్ని తుద ముట్టించాలన్న స్థిరసంకల్పంతో పనిచేస్తూవుంది. దానిఫలితమే బ్రిటన్‌రష్యాల మైత్రి. లేనిపక్షంలో రష్యాతో సంధిచేసుకోవాల్సిన జరూరు రష్యా ఆజన్మ శత్రువైన చర్చిలుకేమిటి ?

అలా ఫాసిజానికి వ్యతిరేకంగా బ్రిటన్, అమెరికా, రష్యా చైనా లొకతట్టు, వాటికి విరుద్ధంగా జర్మని జపాన్ ఇటలీలు ఇంకొకతట్టు తల బడ్డాయి. ఇటిస్థితిలో, ప్రపంచంలోనేస్వాతంత్ర్యం వుండటమూ,నూడటమూ, అనే సమస్య తేలబోతూవుంది.. ప్రపంచంలో ఒకభాగం ఇండియా అవటం వల్ల, ప్రపంచ స్వాతంత్ర్యపోరాటంలో ఇండియా స్వాతంత్ర్యపోరాటం ఒకభాగం. ఫాసిజం జయిస్తే ప్రపంచంలో స్వాతంత్ర్యం శూన్యం. ఆ ప్రపంచంలో ఇండియా భవిష్యత్తు వేరే చెప్పనవసరంలేదు. కాక, మిత్రమం డలి గెలిస్తే ఫాసిజం నశించడమే కాకుండా, దాన్ని అండగా పెట్టుకుంటూ వచ్చిన సామ్రాజ్యవాదం క్షీణించితీరుతుంది. అవల రష్యా బలపడుతుంది. చైనా నిలబడుతుంది. అంటే ప్రపంచంలో ప్రజాస్వామ్యశక్తులు జయిస్తవి. స్వేచ్ఛ, స్వాతంత్ర్యం అనేవి వుంటవి. నాగరికత నిలుస్తుంది. ఇవన్ని ప్రపం చంలో నిల్వగలిగినప్పుడే, యిండియాకు ముక్తివుంది. కనుక, ఈయుద్ధంవల్ల మన బ్రతుకు తెరువు సమస్యకూడ పరిష్కరించబడబోతూవుంది.

ప్రజల బతుకు తెరువు సమస్య నేటి యుద్ధంలో యిమిడివుంది. కనుక ఈ యుద్ధం ప్రజాయుద్ధం; ప్రజలకు సంబంధించిన యుద్ధం. అందువల్ల ప్రజలు ఈయుద్ధంలో చూస్తూ తటపటాయిస్తూ, వూరుకోకూడదు. తమ పక్షం యేదో తేల్చిగా చూచుకోవాలి. ఇండియాలోని ప్రజానీకంకూడా యీ యుద్ధంలో పాల్గొనటమే తమ స్వాతంత్ర్య పోరాటం అని తెలుసుకోవాలి.